# సంఖ్యా శాస్త్రం - మీ అదృష్టం

(సంఖ్యా శాస్త్రము - న్యూమరాలజీ)



కె. శ్రీమన్నారాయణ

# సంఖ్యా శాస్త్రం - మీ అదృష్టం

(సంఖ్యా శాస్త్రము - న్యూమరాలజీ)

కె. శ్రీమన్నారాయణ

**సరస్వతి పబ్లికేషన్**

కాజా వెంకటేశ్వరరావు వీధి, అరండల్ పేట,
విజయవాడ - 2.

సంఖ్యా శాస్త్రం-మీ అదృష్టం

రచన:
కె. శ్రీమన్నారాయణ

ధర : 40/-

పేజ్ మేకింగ్:
సరస్వతి గ్రాఫిక్స్
విజయవాడ



ప్రథమ ముద్రణ:
మే 2010

ముఖచిత్రం:
రమణ

పబ్లిషర్స్ :
**సరస్వతి పబ్లికేషన్**
కాజా వెంకటేశ్వరరావు వీధి,
అరండల్ పేట, విజయవాడ - 2

---

ఈ పుస్తకం కోసం ఎన్నో జాగ్రత్తలు తీసుకోవటం జరిగింది. అయినా పొరపాట్లు దొర్లి ఉండవచ్చును. మాకు తెలిపిన మలిముద్రణలో సవరించగలము.

## విషయసూచిక



ీ ీ ీ

**9 వ సంఖ్య**

ఈ సంఖ్యగలవారు మార్చి 21 నుండి ఏప్రిల్ 27 వరకు మేషరాశి యందు, అక్టోబర్ 21 నుండి నవంబర్ 27 వరకు వృశ్చిక రాశి యందు ఉంటారు.

ఈ తేదీలలో జన్మించిన వారు విశేష అదృష్టవంతులవుతారు. గొప్ప వివేకవంతులవుతారు. చేసే పనుల యందు ఉద్రేక పూరితంగా ఉండక శాంత స్వభావంతో ప్రవర్తిస్తూ, కోపం వచ్చిన సందర్భంలో కూడా ప్రశాంతంగా ఉంటారు.

ఈ విధంగా సంఖ్యా శాస్త్రాన్ని బట్టి శుభ ఫలితాలు తెలుసుకుంటూ తమ జీవితాన్ని సుఖమయంగా చేసుకోవచ్చు.

**శుభం**





# సంఖ్యా శాస్త్రం - మీ అదృష్టం

## సంఖ్యా శాస్త్రం - మీ అదృష్టం
## (సంఖ్యాశాస్త్రము- న్యూమరాలజీ)

ఇదొక అత్యద్భుతమైన జ్యోతిషశాస్త్ర పుస్తకం. ఈ సృష్టిలో కాల స్వరూపం అంతా తానే అని శ్రీకృష్ణుడు భగవద్గీతలో చెప్పాడు. అసలు కాలం అంటే ఏమిటి? ఈ చరాచర జగత్తుకూ, కాలానికీ విడదీయరాని బంధం ఉంది.

అసలు ఈ కాలాన్ని ఎలా కొలవాలి? నిముషాలు, గంటలు, రోజులు, నెలలు, సంవత్సరాలు ఇలా నిరంతరంగా సాగిపోతుంటాయి ఈ యుగాన కాలాల లెక్కలు. అసలు ఈ లెక్కలకు పునాది సంఖ్యలు.

ఒకటి నుండి తొమ్మిది వరకు గల సంఖ్యలను బట్టి మన జీవితంలోని భూతభవిష్య వర్తమానాలను తెలుసుకునే విధానాలను తెలిపేదే 'సంఖ్యాశాస్త్రం.'

ఏదైనా ఒక విషయాన్ని గురించి పూర్తిగా చెప్పేదే శాస్త్రం. ఇది సంఖ్యలలో చెప్పేది కాబట్టి దీనికి సంఖ్యాశాస్త్రం అని పేరు వచ్చింది.

జాతక పుస్తకాలు, సాముద్రికము చదవవలసిన అవసరం లేకుండానే ఒకటి నుండి తొమ్మిది వరకు గల అంకెలను బట్టి జీవితమందలి భూత,భవిష్య, వర్తమానాలను, శుభాశుభాలను, దినచర్య యొక్క ఫలితాలను తెలిపే సంఖ్యాశాస్త్ర విధానం అగ్రస్థానం వహించింది.

మనకు ఆపదలు సంభవించినపుడు విచారానికి లోనై ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయి నిరాశ చెందకూడదు. కర్మ ఫలితాలను చాలావరకు ప్రయత్నముచే మార్చుకోవచ్చును. అందుకే ఈ సంఖ్యాశాస్త్రం ఏర్పడింది.

మనిషెప్పుడూ అనేక శాస్త్రాలను నేర్చుకుంటూ తన విజ్ఞానాన్ని పెంచుకునే ప్రయత్నం చేయాలి. అలాంటి విజ్ఞానం వలన గ్రహబలాన్ని అతిక్రమించి జన్మ రాహిత్యాన్ని పొందవచ్చు.

మన దైనందిన కార్యకలాపాలను, అదృష్ట, దురదృష్టాలను సంఖ్యలే నిర్ణయిస్తాయ నడంలో ఎటువంటి సందేహం అక్కరలేదు. లెక్కలు, కొలతలు, అంచనాలు, సంఖ్యలు లేకుండా ఎటువంటి పనీ జరుగదు.

మానవ జీవితాన్ని అంకెలు ఎలా నిర్దేశిస్తాయి? ఈ అంకెలు సృష్టికి ఆధారంగా ఎలా ఉన్నాయి? ఇలాంటి ఎన్నో ఆశ్చర్యకరమైన సంగతులు మన పూర్వీకులు మనకు తెలిపారు.

అందుకే దీన్ని సంఖ్యాశాస్త్రం అని అంటారు. దీన్నే ఇంగ్లీషులో న్యూమరాలజీ అని చెబుతారు.

మొదట ఏ శాస్త్రాన్ని అయినా నేర్చుకోవటానికి కొంచెం కష్టంగానే ఉంటుంది.

కాని 'అభ్యాసం కూసువిద్య' అనే ఆర్యోక్తిని మనం మర్చిపోకూడదు. కనుక తీరిక, ఓపిక ఉంటే ఈ సంఖ్యాశాస్త్రాన్ని నేర్చుకోవడం మంచిదే.

ఇది స్త్రీ పురుషులకందరికి ఈ శాస్త్రం నిత్యజీవితంలోని కష్టనష్టాలు, లాభనష్టాలు మొదలైన విశేషాలను సులభంగా తెలుసుకోవటానికి ఉపయోగపడుతుంది. వ్యాపారం వల్ల డబ్బు సంపాదించాలనుకునేవారికి, గుర్రం పందాలు మొదలైన వాటియందు ఆసక్తి గలవారికి ఎక్కువగా ఉపయోగం ఉండును.

మనకు కావలసిన విషయాలను ఎక్కువ సులభంగా తక్కువ కాలంలో తెలుసుకోవటానికి సంఖ్యాశాస్త్రాన్ని మించిన శాస్త్రం ఇంకోటి లేదు.

అసలు ఈ సంఖ్యలు ఎప్పుడు, ఏవిధంగా కనుక్కోబడ్డాయో, సంఖ్యలు తొమ్మిదిగా ఉండడానికి కారణమేమిటో తెలిసికోవలసి ఉంది.

సంఖ్యలు మన బుద్ధికి తోచినట్లు ఉపయోగించుకోవడానికి వీలుగా ఉండే విధంగా కల్పించినవి కావు. ఈ సంఖ్యలను ఏర్పరచినవారు సామాన్యులు కారు. వారు సంఖ్యలను ఏవిధంగా ఏర్పరిచారో మన శాస్త్రాలందు వివరంగా తెలిపారు.

నవగ్రహాలకు, మానవ శరీరానికి విశేష సంబంధముంది. నవగ్రహాలు తొమ్మిది. అందుకే సంఖ్యలను కూడా తొమ్మిదిగానే ఏర్పరిచారు.





ఈ తొమ్మిదింటిలో మనిషి జీవిత విశేషాలు, వివాహం, వాహనం, ఆరోగ్యమే కాక ఇంకా చాలా విషయాలు తెలుసుకోవచ్చు. సంఖ్యలు ఎన్ని ఉన్నా, అవి అన్నీ గుణిస్తే తొమ్మిది అంకె లోపే వస్తాయి.

ఉదాహరణకు '40' అనుకుందాం. ఇందులో '0'కు విలువ లేదు. అందువలన అది '4' అవుతుంది. '0'కు తర్వాత వచ్చే సంఖ్యలే లెక్కగానీ, '0' మాత్రం లెక్కలోకి రాదు. అందువలన ఎన్ని సంఖ్యలు ఉన్నా మొత్తం తొమ్మిదిలోపే సంఖ్యలే వస్తాయి. ఈ శాస్త్రాన్నే న్యూమరాలజీ అని అంటారు.

పెద్ద సంఖ్యలు ఎన్ని ఉన్నా, అవి అన్నీ కూడితే తిరిగి తొమ్మిది సంఖ్యలోపు ఏర్పడుతుంది.

ఉదాహరణకు 12-4-1969 ఉన్నాయనుకోండి. అది 1+2+4+1 +9+6+9=32 అవుతుంది. అప్పుడు తిరిగి 3+2=5 అవుతుంది. ఇలా ఎన్ని సంఖ్యలను కూడినా 9 సంఖ్యలోపు మాత్రమే వస్తుంది.

ఈ శాస్త్రానికి ముఖ్యంగా 9 గ్రహాలు ఉండడం వల్ల ఎన్ని వేల సంఖ్యలను కూడినప్పటికీ 9 లోపు రావడం వల్ల ఒక్కొక్క గ్రహానికి ఒక్కొక్క సంఖ్య ఏర్పడింది.

| | | | |
|---|---|---|---|
| రవి | 1 | శుక్రుడు | 6 |
| చంద్రుడు | 2 | కేతువు | 7 |
| గురువు | 3 | శని | 8 |
| రాహువు | 4 | కుజుడు | 9 |
| బుధుడు | 5 | | |

కొందరు జాతక విధానం వలెనే రాహుకేతువులు ఛాయగ్రహాలు అగుటచే వాటికి జాతకంలో స్థానాలు ఏ రీతిగా లేవో, అలాగే రాహు, కేతువులకు సంఖ్యాశాస్త్రంలో కూడా సంఖ్యలు కల్పించలేదు. మిగతా గ్రహాలకు సంఖ్యలను ఈక్రింద తెలిపిన విధంగా ఏర్పరిచారు.

| | | | |
|---|---|---|---|
| రవి | 1-4 | శుక్రుడు | 6 |
| చంద్రుడు | 2-7 | శని | 8 |
| గురువు | 3 | కుజుడు | 9 |
| బుధుడు | 5 | | |

ఈ పద్ధతిలో సూర్యుడికి 1,4 సంఖ్యలు, చంద్రునకు 2,7 సంఖ్యలు వచ్చుచున్నాయి. అనగా సూర్యుడికి తన సంఖ్య 1 కాకుండా అదనంగా 4 సంఖ్య, అలాగే చంద్రునకు తన సంఖ్య 2 కాకుండా 7 అదనంగా వస్తున్నాయి.

అనగా రవి, చంద్రులు బలవంతులుగ ఉన్నప్పుడు 1,2 సంఖ్యలుగా, బలహీనంగా ఉన్నప్పుడు 4,7 సంఖ్యలుగా ఉంటున్నారు. బలవంతులుగా ఉన్నప్పుడు శుభ ఫలితాలను, బలహీనంగా ఉన్నప్పుడు అశుభ ఫలితాలను కలుగజేస్తున్నారు.

ఈ సంఖ్యాశాస్త్రం ద్వారా మనిషి యొక్క భూత, వర్తమాన, భవిష్యత్తు కాలానికి సంబంధించిన గుణగణాలను క్షుణ్ణంగా పరిశీలించి, వారికి ఏ సంఖ్య కలసి వస్తుంది? వారి వివాహ జీవితం ఎలా ఉంటుంది అనే విషయాలను మనం సులభంగా గ్రహించుకోవచ్చు.

ఈ సంఖ్యాశాస్త్రం మూడు రకాలుగా విభజించారు. అవి–

## 1. జన్మతేదీని బట్టి చూసుకునే విధానం

మీరు పుట్టిన తేదీని ఏక సంఖ్యారూపంలోకి మార్చినపుడు వచ్చే ఏకసంఖ్యను జనసంఖ్య అంటారు.

ఉదాహరణకు మీరు పుట్టింది ఏ సంవత్సరమైనప్పటికీ, ఏ నెల అయినా కాని తేది చాలా ముఖ్యం. అంటే ఏ నెలలోనైనా 6వ తేదీన జన్మించిన వారైతే 6వ సంఖ్యగల వారవుతారు. అలాగే 27వ తేదీన జన్మించినవారు 2+7 =9 వ సంఖ్యగల వారవుతారు.

## 2. జనన తేదీ, నెల సంవత్సరం చూసుకునే విధానం

ఇది మీ యొక్క పుట్టినతేదీ, పుట్టిన నెల, సంవత్సరాల సంఖ్యలన్నింటినీ కూడడం ద్వారా తెలుసుకోవచ్చు.

ఉదాహరణకు 7-5-1959న జన్మించారనుకుందాం. ఇప్పుడు ఈ సంఖ్యలన్నీ కూడుదాం. 7+5+1+9+5+9=36 అవుతుంది. వాటిని తిరిగి మరలా కూడగా 3+6=9 వస్తుంది. అప్పుడు వారు 9వ సంఖ్యగలవారు అవుతారు.

అలాగే 21-4-1963వ తేదీన జన్మించిన వారిని చూడగా 2+1+4+1+9+6+3=26 అవుతుంది. అంటే 2+6=8 వస్తుంది. వారు 8వ సంఖ్యగల వారవుతారు. ఇందులో సంవత్సరం, నెల, తేదీ చాలా అవసరం. ఈ మూడింటి ద్వారా ఖచ్చితమైన సంఖ్యను తెలుసుకోవచ్చు.

## 3. పూర్తిపేరును బట్టి తెలుసుకునే విధానం

మీ పేరును ఇంగ్లీషు అక్షరాలలో వ్రాసుకుని వాటికి సంబంధించిన సంఖ్యలను కూడితే వచ్చే ఏకసంఖ్య మీ అదృష్టసంఖ్య అవుతుంది.





మీ పూర్తిపేరులోని అచ్చులు, హల్లులు అన్ని అక్షరాల మొత్తాన్ని కూడడం ద్వారా సంఖ్యను తెలుసుకోవచ్చు. పేరులో వచ్చే సంఖ్యలను విడివిడిగా కూడి ఏకసంఖ్యలోకి మార్చుకోవాలి.

సంఖ్యలు చూపే ప్రభావాలను తెలుసుకునే ముందు ఏ అక్షరానికి ఏ సంఖ్య వస్తుందో తెలుసుకుందాం.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| A | B | C | D | E | F | G | H | I |
| 1 | 2 | 3 | 4 | 5 | 8 | 3 | 5 | 1 |
| J | K | L | M | N | O | P | Q | R |
| 1 | 2 | 3 | 4 | 5 | 7 | 8 | 1 | 2 |
| S | T | U | V | W | X | Y | Z | |
| 3 | 4 | 6 | 6 | 6 | 5 | 1 | 7 | |

ఇందులో 9వ సంఖ్య కనబడదు. అనగా వారికి, 9వ సంఖ్యకు ఎక్కువ ప్రాధాన్యత కలదు. అందువలన మిగిలిన సంఖ్యల కన్న 9వ సంఖ్యకు మంచి గుర్తింపు ఇచ్చారు.

పేరును బట్టి సంఖ్యను తెలుసుకునే విధానం ఇలా ఉంటుంది.

VIJAY BABU అనే పేరుకి–

పైన తెలిపిన అక్షరములను పరిశీలించి వాటికి సంబంధించిన సంఖ్యలను వేసి కూడితే 6+1+1+1+1+2+1+2+6=21 అవుతుంది. వాటిని తిరిగి మరలా కూడితే 2+1=3 అవుతుంది. అప్పుడు వారు 3వ సంఖ్యవారు అవుతారు.

ఇంకొక విధానం ఏమిటంటే నక్షత్రాలను బట్టి సంఖ్యను తెలుసుకోవటం.

మన నక్షత్రములు 27. అంటే 2+7=9 అవుతుంది. ఎవరైనా సరే ఈ 27 నక్షత్రముల యందు మాత్రమే జన్మిస్తారు. ప్రతి నక్షత్రానికి కొన్ని అక్షరాలు ఉంటాయి. కాబట్టి ప్రతి మనిషి ఏదో ఒక నక్షత్రానికి సంబంధించిన వారై ఉంటారు.

ఉదాహరణకు రామకోటేశ్వరరావు అనే పేరు గలవారు మొదటి అక్షరము 'రా'. అనగా పేరునందు మొదటి అక్షరాన్ని మాత్రమే మనం తీసుకోవాలి. ఈ 'రా' అనే అక్షరము 'చిత్తా' నక్షత్రానికి సంబంధించినది.

అంటే ఈ పేరుగలవారు చిత్తా నక్షత్రం గలవారై ఉంటారు. అశ్వనీ నక్షత్రము మొదలు చిత్తా నక్షత్రం 14వది అవుతుంది. అనగా వీరు 1+4=5 వ సంఖ్యగల వారవుతారు. ఇలాగే ఇంకో పేరు తీసుకుందాం.

లీలావతి అను పేరుగలవారికి 'లీ' అనగా భరణీ నక్షత్రానికి చెందినది. అశ్వని నక్షత్రం నుండి భరణీ నక్షత్రం 2వది అవుతుంది. కాబట్టి ఈ పేరు గలవారు 2వ సంఖ్య గలవారై ఉంటారు.

ఎవరి పేరులో మొదటి అక్షరము ఏ నక్షత్రానికి సంబంధించిందో చూసుకుని ఆ నక్షత్ర సంఖ్యను తెలుసుకుని, వచ్చిన సంఖ్యను కూడుకున్నచో వచ్చిన సంఖ్యలను బట్టి వారు ఆ సంఖ్యగలవారగుదురు.

ఏసుపాదం అనే పేరుగల వారు కృత్తిక నక్షత్రం గలవారై ఉంటారు. కృత్తిక నందు 'ఏ' అనే అక్షరం ఉండటం వలన ఆ నక్షత్రం 3వ స్థానంలో ఉంటుంది. కాబట్టి వారు 3వ సంఖ్యగలవారై ఉంటారు.

అలాగే వారాలను బట్టి కూడా ఏ సంఖ్యగలవారో తెలుసుకోవచ్చు. ఆదివారం, సోమవారం, మంగళవారం, బుధవారం, గురువారం, శుక్రవారం, శనివారం.

రవి అంటే ఆదివారం 1, చంద్రునికి సోమవారం 2, కుజునికి మంగళవారం 9, బుధునికి బుధవారం 5, గురునికి గురువారం 3, శుక్రునికి శుక్రవారం 6, శనికి శనివారం 8 సంఖ్యలు వస్తాయి.

రాహుకేతువులు ఛాయాగ్రహాలు కాబట్టి రవికి 4వ సంఖ్య (అనగా రాహువు) చంద్రునికి 7వ సంఖ్య (కేతువు) అదనంగా వస్తున్నారు. మొత్తం 9 సంఖ్యలు 9 గ్రహాలు. 7 రోజులకు 9 సంఖ్యలు ఇవ్వబడ్డాయి.

ఎవరికైనా పుట్టిన వారం తెలిస్తే ఆ వారం చూసుకుని, ఆ సంఖ్య వారుగా చూసుకోవచ్చును. ఉదాహరణకు సోమవారం జన్మించారనుకోండి. చంద్రుడు అధిపతియైన 2వ సంఖ్యగలవారుగా మనం తెలుసుకోవచ్చు.

ఇంకా మనం బాగా పరీక్షిస్తే 1వ సంఖ్యావారు 4వ సంఖ్యగలవారిపై ఇష్టం, ప్రేమ గలవారుగా ఉంటారు. అలాగే 2వ సంఖ్యగలవారు 7వ సంఖ్యగలవారిపై ఆదరాభిమానాలు అధికంగా ఉంటాయి.

1 నుండి 9 వరకు గల సంఖ్యలు కేవలం రవి, చంద్రుడు మొదలైన 9 గ్రహాల సంఖ్యను బట్టే ఏర్పడ్డాయి. అందుకే తొమ్మిది గ్రహాలకు, ఈ తొమ్మిది సంఖ్యలకూ చాలా సన్నిహిత సంబంధం ఉంది.





రవి మొదలైన ముఖ్యగ్రహాలు 7 అనియు, ఈ 7 గ్రహాలను బట్టి ఆది వారాది వారాలు 7గా ఏర్పడ్డాయి.

గ్రహాలు, వారాలు ఈ రెండూ 7 సంఖ్యలలోనే ఉండటం వల్ల 7 సంఖ్యలో ఏదో ఒక గొప్ప విశేషం ఉంటుందని అనుకోవచ్చు.

గ్రహాలు, వారాలే గాక ఈ ప్రపంచం నందుగల భూభాగాన్నంతా మన పూర్వీకులు సప్త ద్వీపాలుగా విభజించారు. అలాగే వ్యసనాలను సప్తవ్యసనాలని అంటారు. ఋషులు కూడా సప్త ఋషులనే పిలువబడుతున్నారు. ఈ 7 సంఖ్యలో ఉన్న విశేషాలు ఇంకా ఉన్నాయి.

కనుక 7 సంఖ్యలో ఈ విషయాలన్నింటినీ ఏర్పరచడానికి ఏదో కారణం ఉండి ఉంటుంది. ఈ 7 సంఖ్య యొక్క విశేషాలను గురించి తర్వాత తెలుసుకుందాం.

## ఒకటవ సంఖ్య

సంఖ్యలన్నిటిలోకి 1వ సంఖ్య మిక్కిలి ప్రధానమైంది. ఈ సంఖ్యను అనుసరించే మిగిలిన సంఖ్యలన్నీ ఏర్పడ్డాయి. ఈ సంఖ్యకు అధినాయకుడు సూర్యుడు.

1వ సంఖ్యనందు జన్మించినవారు పట్టుదల స్వభావం గలవారుగాను, స్థిరస్వభావం గలవారుగాను, ప్రయత్నించిన కార్యం సాధించేవరకు పట్టువదలని వారుగాను ఉంటారు.

గొప్ప నాయకత్వ లక్షణాలు కలిగిన సంఖ్య 1. అంటే మిగతా సంఖ్యలకు మూలం ఈ 1వ సంఖ్యేనని తెలుసుకోవాలి.

1వ సంఖ్య సృష్టిని, మానవశక్తిని, వ్యక్తిత్వాన్ని తెలియజేస్తుంది. ఏ సంవత్సరంలోనైనా, ఏ నెలలోనైనా 1,10,19,28 తేదీలలో జన్మించినవారికి 1వ సంఖ్య అవుతుంది. అంటే ఈ తేదీలలో పుట్టినవారు 1వ సంఖ్యగలవారిగా భావించి ఫలితాలను చూసుకోవాలి.

1వ సంఖ్య గలవారు ఎటువంటి పనైననూ స్వయంగా చేసుకునే శక్తి సంపన్నులుగా ఉంటారు. వీరు ఎక్కువ ఆశను కలిగి ఉంటారు. వీరు ఎప్పుడూ తమ స్వశక్తిచే విశేష అభివృద్ధికి వస్తారు.

తరచుగా రాజకీయాలలో పాల్గొని ప్రజాధికారాన్ని సంపాదించటానికి తమ శక్తి అంతా ధారపోసి కృషి చేస్తారు. చివరికి ఏదో ఒక సంఘానికైనా నాయకత్వం వహించి ఆ సంఘాన్ని విజయవంతంగా నడుపుతారు.

1వ సంఖ్య నందు జన్మించిన వారు మధ్యరకమైన ఎత్తుగలవారు, ఒత్తయిన నొసలుగలవారు, మంచి ఆకర్షణీయమైన మాట తీరుగలవారు, స్థిరమైన మనస్సు గలవారు, అందరికీ చేదోడు వాదోడుగా ఉండగలవారు, అందరికీ సహాయం చేసేగుణం గలవారు అయి ఉంటారు.

వీరికి అధికమైన పట్టుదల, కొంత మొండి వైఖరి అధికంగా ఉండేవారుగా ఉంటారు. ఏ పని మొదలుపెట్టినా ఆ పని అయ్యేవరకూ దీక్షగా ఆ పని చేయగలవారుగా, నిష్కల్మషంగా మాట్లాడే స్వభావం, తొందరపాటు స్వభావం వలన వీరి నుండి సహాయం పొందిన వారు కూడా వీరిని తక్కువగా అంచనా వేసేవారిగా ఉంటారు.

ఎక్కువ ఆత్మవిశ్వాసం గలవారు, ఏ విద్యనైనా తేలికగా నేర్చుకునే స్వభావం గలవారు, ఇటువంటి వారు ఎవరి సహాయం, సహకారం ఆశించకుండా స్వశక్తితో అభివృద్ధిని సాధిస్తారు.

వీరు ప్రశాంత వాతావరణం కోరుకునే స్వభావం గలవారు. అయినప్పటికీ వీరి సహాయం, సహకారం కోసం వీరి స్నేహితులు వీరికి ప్రశాంతత ఉండనీయరనే చెప్పుకోవాలి.

వీరు సంఘంలో పేరు, ప్రఖ్యాతి పొందుతారు. ఒకరితో పనిలేకుండా స్వతంత్రంగా పని చేసుకోవడాన్ని ఇష్టపడతారు. మాట సూటిగానూ, పరుషంగానూ ఇతరులను శాసించే విధంగా ఉండడం వల్ల ఏ కారణం లేకుండానే శతృవులను పోగుచేసుకుంటారు.

తమ పనులను చక్కని క్రమశిక్షణతో నిర్వహించుకునే నేర్పు కలవారవుతారు. ఇక వీరికి జాతక చక్రం గనుక బలంగా ఉన్నట్లయితే వీరు ప్రభుత్వ అధికారులుగా, విదేశీ ప్రముఖులుగా అధికారం చెలాయిస్తారు.

ఎదుటివాళ్లను గమనించి, ఎదుటివాళ్ళ అభిప్రాయాలను తెలివిగా కనుగొనేస్వభావం గలవారై ఉంటారు. ఎదుటి వారి ఆలోచనలు కనిపెట్టి వారి ఆలోచనలకు ఎత్తుకు పై ఎత్తు వేయు స్వభావం గలవారై ఉంటారు.

వీరికి వివేకం ఎక్కువగా ఉంటుంది. దానం చేసే గుణం ఎక్కువగా ఉండడం వల్ల వీరు ఎవరికైనా దేనినయినా దానం చేసి అనేక సమస్యలు కొని తెచ్చుకుంటారు. వీరి సలహా, సహకారం కోరుకునే ప్రముఖులు ఉంటారు.

వీరికి తమంతటి వారు లేరు అనే అభిప్రాయం ఎక్కువగా ఉంటుంది. వీరిని పొగిడితే తేలిగ్గా పొంగిపోతారు. వీరికి ఆర్థిక పరమైన విషయాలమీద అధికంగా ఇష్టం ఉంటుంది.





దైవకార్యక్రమములందు, సంఘ కార్యక్రమములందు వీరు చురుకుగా పాల్గొంటారు. వివిధ రంగాల వృత్తుల వారు చురుకుగా రాణిస్తారు. వీరు ఊహించని ఖర్చులు తమ కుటుంబం కోసం చేస్తారు.

ఈ సంఖ్య గలవారు నీతి, నియమాలకి కట్టుబడి ఉంటారు. వీరు ఏది చెప్పినా ఎదుటివారికి అర్థం అయ్యేట్లు ఉంటుంది. వీరికి బంధుమిత్రులమీద ఎక్కువగా ప్రేమ ఉంటుంది. వీరు మిత్రులతో సరదాగా గడపటానికి ఇష్టపడతారు. వీరి జీవితంలో ద్వితీయ భాగం చాలా ఆనందమయంగా ఉంటుంది.

## వివాహజీవితం - ఆర్థిక పరిస్థితులు

వీరి కుటుంబ జీవితం చాలా ఆనందదాయకంగా ఉంటుంది. ఈ దంపతుల మధ్య ఎటువంటి బేధాభిప్రాయాలు తల ఎత్తిన వెంటనే సమసిపోతాయి. వీరి భార్య వీరికన్నా కొంత అందం తక్కువగా ఉంటుంది.

ముఖ్యంగా ఈ 1వ సంఖ్య గలవారు 2,4,8,7వ సంఖ్యగలవారిని పెళ్లి చేసుకుంటే సుఖదాయకంగా ఉండగలరు. వీరు 1వ సంఖ్యగలవారినే వివాహం చేసుకోవడం అంత శుభం జరుగదు.

వీరి సంతానం మంచి యోగప్రదంగా ఉంటుంది. 25, 28, 30, 32వ సంవత్సరంలో వివాహం జరుగుతుంది. వివాహం తర్వాత వీరి జీవితంలో అనుకోని మార్పులు జరుగుతాయి.

ఆర్థికంగా వీరి జీవితం చాలా ఆనందంగా ఉంటుంది. 30-35 సంవత్సరాలు నుండి వీరు అన్ని రంగాలలోను ఊహించని అభివృద్ధిని పొందుతారు. ఊహించని ఖర్చులు చేసినా తిరిగి ఏదో విధంగా ధనం సమకూరుతుంది.

ఆరోగ్య విషయంలో వీరు ఎక్కువగా జాగ్రత్త పడడం అవసరం. వీరికి డయాబెటిస్, దృష్టిలోపం, ఉదర సంబంధమైన అనారోగ్యం కలగవచ్చు. వీరికి అనేకమైన అలవాట్లు ఉన్నప్పటికీ వెంటనే మానివేసే స్వభావం ఉంటుంది.

1వ సంఖ్యకు చెందిన స్త్రీలు చక్కటి హాస్యచతురతతో, చెరిగిపోని చిరునవ్వుతో, కలుపుగోలు తనం కలిగి పదిమందినీ ఆకట్టుకుంటారు. ధనం విషయంలో వీరికి ఎటువంటి బెంగా అవసరం ఉండదు.

ధనాన్ని సంపాదించడం, దాన్ని నిమిషాల వ్యవధిలో విలాసాల కోసం ఖర్చుచేయడం వీరికి వెన్నతో పెట్టిన విద్య. తమ 25వ సంవత్సరం నుండి

వీరి వృత్తుల్లో, ఉద్యోగాల్లో రాణిస్తారు. వీరికి 40 సంవత్సరాలు వచ్చే సమయానికి అనుకోని విధంగా కొన్నిమార్పులు చోటు చేసుకుంటాయి.

ఏది ఏమైనా వీరు తమ ఆరోగ్యం పట్ల జాగ్రత్త వహించడం అవసరం.ముఖ్యంగా 50-60 సంవత్సరాల వయస్సులో వచ్చే గుండెకు సంబంధించిన జబ్బుల విషయంలో జాగ్రత్తపడటం మంచిది.

1వ సంఖ్య గలవారు ఏ నెలలో నైనా 28వ తేదీన పుట్టిన వారు భవిష్య అవసరాలను దృష్టిలో ఉంచుకుని మరీ ఖర్చు పెట్టడం మంచిది. వీరికి చెడు పరిస్థితుల్లో దైవసహాయం తోడవుతుంది. ఒక్కొక్కప్పుడు అధికమైన సమస్యలు ఎదురైనా తర్వాత చాలా ఆనందదాయకంగా ఉంటారు.

వీరు ముఖ్యంగా 'జాతికెంపు' ఉంగరం ధరిస్తే శుభం కలుగుతుంది. ఎరుపు, పసుపు, పచ్చ, తెలుపు రంగులు కలిగిన దుస్తులు ధరిస్తే మంచిది.

1వ సంఖ్యగలవారికి ఆదివారం, సోమవారం చాలా అనుకూలంగా ఉంటుంది. అలాగే ముఖ్యంగా 1,10,19,28 తేదీలు, 1వ సంఖ్యకు అనుకూలంగా ఉంటే 2,4,7 తేదీలును, రెండు సంఖ్యలును మొత్తం చేస్తే 2,4,7 గావచ్చు.

ఈ తేదీలు 11,13,16,20,22,25,29,31లకు ఆదివారంతో గాని, సోమవారంతో గాని కలిసినపుడు ఆ రోజులలో గొప్ప శుభఫలితాలు కలిగి విశేష జయప్రదంగాను, అనుకూలంగాను ఉంటుంది.

వీరు బంగారంతో చేసిన ఆభరణాలు గానీ, పసుపు పచ్చ రంగు గల ఇతర లోహాలతో చేసిన ఆభరణాలు ధరించటం మంచిది.

పసుపుపచ్చ, తెలుపు, తెలుపుతో కలసిన పసుపుపచ్చ రంగులు వీరికి అనుకూలమైన రంగులు.

1వ సంఖ్యగలవారు పైనచెప్పబడిన వారాలందుగాని, తేదీలందుగాని నూతన ప్రయత్నం చేయడం వల్ల మంచి ఫలితం ఉంటుంది.

1వ సంఖ్యగలవారు ఎప్పుడూ అభివృద్ధి కోసం ఎక్కువ ప్రయత్నాలుచేస్తారు.వీరు తాము చేస్తున్న వ్యాపారాలందుగాని, ఇతర విషయాలలో గాని, ఉద్యోగాలలో గాని ఉన్నత స్థానాన్ని అలంకరిస్తారు.

1వ సంఖ్యగలవారు తమ స్వశక్తితో జీవించడానికి ప్రయత్నిస్తారు. గొప్పమేధాశక్తి గలవారుగా, కొత్త విషయాలను తెలుసుకునే ఉత్సాహవంతులుగా ఉంటారు. అసలు 1వ సంఖ్య గొప్ప సాహసానికి గుర్తు.





కాని 1వ సంఖ్యగలవారిలో ఒక లోటు మాత్రం కనబడుతుంది. తాముపట్టుకున్న కుందేటికి మూడేకాళ్లని వాదిస్తుంటారు. తమ అభిప్రాయమే కరెక్ట్ అని, దాని ప్రకారం నడవాలనే పట్టుదలతో ఉంటారు.

వీరి అదృష్ట రంగులు - లేత ఛాయగల నీలం రంగు, కాషాయం, లేత గోధుమ రంగు, బంగారు రంగు, పసుపు పచ్చ రంగులు వీరికి బాగా కలసి వస్తాయి. వీరు తమ గదుల్ని, గదిలోని వస్తువుల్ని ఈ రంగుల్లో అమర్చుకుంటే బాగుంటుంది.

## రెండవసంఖ్య

నవగ్రహాలలో రవికి తరువాతి స్థానంలో చంద్రుడున్నాడు. ఈ 2వ సంఖ్యకు అధిపతి చంద్రుడు.

చంద్రుడు స్త్రీ గ్రహంగా నిరూపించబడ్డాడు. స్వభావాల విషయంలో 1వ సంఖ్య గలవారికి, 2వ సంఖ్య గలవారికి ఏ మాత్రం పోలిక ఉండదనే చెప్పాల్సి ఉంటుంది. అయినా 1వ సంఖ్యగలవారు, 2వ సంఖ్య గలవారు ఒకరికొకరు అధిక అనురాగాన్ని విశ్వాసాన్ని, అభిమానాన్ని కలిగి ఉంటారు. వీరిరువురు కలసి ఎటువంటి వ్యాపారం చేసినా బాగా కలసి వస్తుంది.

2వ సంఖ్యకు చెందినవారు ఆకర్షణీయమైన రూపంతో చక్కని కళ్లు కలిగి, మంచి రంగు లేక ఛామన చాయ రంగు కలిగి ఉంటారు. వీరు చాలా సున్నితమనస్కులు. ఎదుటివారిని ఇట్టే ఆకర్షిస్తారు.

ప్రశాంతమైన జీవితాన్ని, శాంతస్వభావాన్ని కలిగి ఉంటారు. పల్చని, మెత్తటి వెంట్రుకలతో మధ్యరకం ఎత్తుతో కనబడుతుంటే వీరు తమ అభిప్రాయాలను ముఖంలో స్పష్టంగా చూపెడతారు.

కాని వీరి బుద్ధి, ఆలోచనలు అంత స్థిరంగా ఉండవు. శరీర బలం విషయంలో వీరు 1వ సంఖ్య వారికంటే కొంచెం తక్కువగానే ఉంటారు. ఎదుటివారి కష్టాలను చూసి వెంటనే స్పందించడం వీరి అలవాటు.

అలాగే ఇతరులను ఏ విధంగానయినా సరే కష్టపెట్టడం వీరికి ఇష్టముండదు. అందరికీ మంచి జరగాలనుకునే వీరు, విద్యాధికులై, జ్ఞానవంతులై అందరికీ బాసటగా నిలుస్తారు. ఊహించని రీతిలో వీరికి అభివృద్ధి కలుగుతుంది.

2వ సంఖ్య గలవారు మంచి ఆలోచనాశక్తిని, సూక్ష్మబుద్ధిని కలిగి ఉంటారు. కళలందు వీరికి అభిమానం అధికంగా ఉంటుంది. వీరి రచనా వ్యాసంగంలో మంచి పేరుప్రఖ్యాతులు కలిగినా ఆశ్చర్యపోనక్కర్లేదు.

ఎటువంటి విషయంలోనయినా నిదానంగా ఆలోచించి ఒక నిర్ణయానికి రావడం వీరికి నచ్చిన మంచి పద్ధతి. అయినప్పటికీ కొన్నిసార్లు అనవసర నిర్ణయాలు తీసుకుని ఆ తరువాత బాధపడుతుంటారు.

సాధారణంగా వీరి జీవితాలు ఒక్కొక్కప్పుడు మంచి ఉన్నతస్థానాన్ని పొంది వెంటనే అధోగతి పాలవుతుంటుంది. ఎప్పుడూ తిరుగుతూ ఉండటం వీరికి ఇష్టం. వీరికి భోగము లందు ఎక్కువగా ఆసక్తి ఉంటుంది. మంచి ఉద్రేకమైన ప్రవర్తన కలిగి ఉంటారు. ఎప్పుడూ ఏదో ఒక విషయం గూర్చి దీర్ఘాలోచన చేస్తుంటారు.

2వ సంఖ్యగలవారు ఏ పని అయినా తొందరగా నేర్చుకోవడం వీరికి అలవాటు. దైవభక్తి కలవార్తై, బుద్ధిమంతులన్న పేరుతో, ఎదుటివారి మనస్తత్వాన్ని ఇట్టే పసిగట్టడం వీరికి వెన్నతో పెట్టిన విద్య.

ఈ 2వ సంఖ్య గలవారు ఓడలపై మంచి ఉద్యోగం చేయువారుగా, నటులుగా, కవిత్వం చెప్పి జీవించే వారిగా ఉంటారు.

ఈ సంఖ్య గలవారికి తొందరగా కోపమేరాదు. అందమైన ప్రకృతిని ఆరాధించడం వీరి ప్రత్యేకత. తమకు వచ్చే సమస్యలను ఎదుటివారికి తెలియకుండా జాగ్రత్తగా పరిష్కరించుకుంటూ, తప్పు లేమైనా జరిగితే సరిదిద్దుకుంటారు.

2వ సంఖ్యగల స్త్రీలు అతిభయస్తులై, చిన్న చిన్న విషయాలకు కూడా భయపడుతుంటారు. వీరు అలంకార ప్రియులు. ప్రతి చిన్న విషయానికి మార్పులు చేర్పులు చేయడం వీరికి ఇష్టం ఉండదు.

2వ సంఖ్యగలవారికి ప్రతి మాసమందు 2,11,20,29 తేదీలుచాలా అనుకూలంగా ఉంటాయి. కనుక ఎటువంటి నూతన వ్యాపారంగాని, శుభకార్యంగాని ఈ తేదీలలో చేయడం వారికి చాలా మంచిది.

వీరికి ఆదివారం, సోమవారం, శుక్రవారాలు చాలా అనుకూలమైన రోజులు. ఈ వారాలలో 2,11,20,29 తేదీలు వచ్చినచో ఇంకా ఎక్కువ అనుకూలంగా ఉంటుంది. వివాహ విషయంలో వీరికి జాగ్రత్త ఎంతో అవసరం.

2వ సంఖ్యగలవారు ఎవరికీ తొందరగా తలవంచరు. ఓటమిని ఒప్పుకోరు.

వీరు అలుపెరుగని యోధులుగా ఉండి చివరి కంటా పోరాడతారు. తాము తృప్తి పడేంత వరకూ ఏ పనినీ ఆపరు.





2వ సంఖ్యగలవారు తల్లి లేదా సోదరీమణుల వలన చాలా ప్రయోజనం పొందుతారు. వీరు ఎప్పుడూ చక్కని వస్త్రధారణతో అందరినీ ఆకట్టుకుంటారు. వీరికి తెలుపు, క్రీము రంగులంటే ఎక్కువ ఇష్టపడతారు.

2వ సంఖ్యగల స్త్రీలు ఇంటిని తీర్చిదిద్ది, గృహ వివాదాలు పరిష్కరించగలిగే సమర్థులై ఉంటారు. చక్కని కలివిడితనంతో కుటుంబ సభ్యులను ఆకట్టుకుంటారు. లలితకళలు, సంగీతం, నాట్యం, ఉద్యానవన సంరక్షణ వంటి వాటిల్లో వీరిదే పైచేయి.

## వివాహ జీవితం - ఆర్థిక పరిస్థితులు

మంచి సంస్కారం, ఉన్నత విద్యావంతులైన వీరి వివాహ జీవితం చాలా సంతోషంగా ఉంటుంది. వీరు 3,5,8 సంఖ్య గలవారిని వివాహం చేసుకుంటే సంసారం బాగా సాగుతుంది.

ఈ సంఖ్యకు చెందిన వారు 25 సంవత్సరాల లోపు వివాహం చేసుకుంటే జీవితం చాలా సామాన్యంగా ఉంటుంది.

ఎక్కువగా వీరికి 25–30 సంవత్సరాల మధ్య వివాహం జరుగుతుంది. ఒక్కొక్క సారి వీరి వివాహ జీవితం ఒడిదుడుకులవుతుంది. కాబట్టి ఎదుటివారి గురించి బాగా విచారించి వివాహం చేసుకుంటే శుభదాయకంగా ఉంటుంది.

వీరి సహచరులు మంచి సంస్కారవంతులై, విజ్ఞానవంతులుగా ఉంటారు. అందుచేత వీరిచ్చే సలహాలు ఇతరుల విషయంలో చక్కగా పనిచేస్తాయి. ఇతరులతో అభిప్రాయబేధాలు తలెత్తినప్పటికీ, వాటిని వీరు నేర్పుగా పరిష్కరించుకుంటారు.

వీరికి 35వ సంవత్సరం నుండి ఊహించని మార్పులు, అభివృద్ధి కలుగుతుంది. అయితే ఆప్తులను, మిత్రులను గుడ్డిగా నమ్మే వీరు ఒక్కోసారి వారి సలహాల వలన కష్టనష్టాలను ఎదుర్కోవలసి వస్తుంది.

25వ సంఖ్యగలవారు వస్తు, వాహనాలను సమకూర్చుకోగలుగుతారు. కానీ వీరికి పేరుకి తగిన సంపాదన ఉండదు. ఆర్థికంగా పెద్ద సమస్యలేమీ ఎదురు కానప్పటికీ 35వ సంవత్సరం నుండి ఆర్థికంగా బాగా స్థిరపడతారు.

వీరికి వస్తువుల పట్ల ఆసక్తి ఎక్కువగా ఉంటుంది. అతి శుభ్రత వంటి ఛాదస్తం వల్ల విమర్శలను ఎదుర్కొంటారు.

ఎక్కడ పెట్టిన వస్తువు అక్కడ ఉండాలనుకునే వీరు ఎక్కువగా మతిమరుపును కలిగి ఉంటారు.

రచనా, వ్యాపార రంగాలలో వీరు కష్టించి పైకొస్తారు. ఈ సంఖ్యగల రాజకీయ నాయకులకు ఊహించని అభివృద్ధి, వీరు ఎవరితోనూ ఒక పట్టాన ఏకీభవించకపోవడం వల్ల ఎదురు దెబ్బలను తినాల్సి ఉంటుంది.

కళారంగంలో వీరి అభివృద్ధి సామాన్యమే. పారిశ్రామిక, పత్రికా రంగాలలో వీరు మంచి స్థాయికి చేరుకుంటారు. భవిష్యత్తులో ఉన్నత పదవులనలంకరించే అవకాశం వీరికి ఎక్కువగా ఉంటుంది.

ఈ సంఖ్యగలవారికి ఆత్మవిశ్వాసం ఎక్కువ. వీరు తమ కుటుంబ సభ్యుల కోసం మంచి పథకాలను రచించి విజయాన్ని పొందుతారు.

కాలక్రమంలో మత తార్కిక, ధార్మిక దృక్పథం, తమ అనుభవం, అపారజ్ఞానంతో వీరు ఇతరులపై చక్కని మార్గం సృష్టిస్తారు. ముఖ్యంగా 70-80 సంవత్సరాల వృద్ధాప్యంలో వీరు ధార్మిక గురువులుగా పరిణామం చెందుతారు.

2వ సంఖ్యగలవారికి 4వ సంఖ్యగలవారితో సంబంధాలు జీవితంలో ఇబ్బందులు కలిగిస్తాయి. అయితే వ్యాపారం, రాజకీయాలు, విద్య, పరిశోధన, తత్త్వ, ఆధ్యాత్మిక రంగాల్లో వీరికి పురోగతి పుడుతుంది.

వీరికి 5వ సంఖ్యగలవారితో కూడా ఇబ్బందులు కలుగుతాయి. అయితే విదేశీ సంబంధాలు, విదేశీయాత్రలు వీరికి అనుకూలంగా ఉంటాయి.

వీరు విదేశాలకు వెళ్ళినప్పటికీ, స్వదేశంలోనే స్థిరపడే అవకాశాలు ఎక్కువ. ఈ సంఖ్య గలవారిని చూసి అసూయపడేవారు సంఘంలో ఎక్కువగానే ఉంటారు.

ఆరోగ్య విషయంలో వీరు జాగ్రత్తగా ఉండటం చాలా అవసరం. నరాలు, హృదయానికి సంబంధించిన వ్యాధుల వల్ల వీరు ఇబ్బందులు ఎదుర్కోక తప్పదు.

వీరు తేలిక రంగు దుస్తులను, ఆకుపచ్చ రంగు దుస్తులను ధరిస్తే శుభం కలుగుతుంది. స్పందన ముత్యంగానీ, చంద్రకాంత మణిని గాని ధరిస్తే పురోభివృద్ధి కలుగుతుంది. వీరు వెండి ప్లాటినం వంటి ఆభరణాలు ధరిస్తే మంచి జరుగుతుంది.

వీరికి తెలుపురంగు కూడా కొంచెం శుభప్రదమైనదనే చెప్పవచ్చును. ఎరుపురంగు గలవాటిని ధరించడం మంచిది కాదు.

నలుపు రంగు ఎంతమాత్రం మంచిది కానే కాదు. వీరు ఆకుపచ్చ రంగు గల దారాన్ని ఎల్లప్పుడూ ధరించడం వలన చేసే ప్రయత్నాలలో జయమును, వశీకరణం కలుగును.





వీరికి 1,2,4,7,11 మాసములు అనగా జనవరి, ఫిబ్రవరి, ఏప్రిల్, జులై, నవంబరు మాసములు చాలా అనుకూలంగా ఉంటాయి.

మొత్తంగా కూడగా వచ్చు 1,2,4,7 సంవత్సరములు వీరికి మంచి యోగదాయకంగా ఉంటాయి.

వీరికి ఉత్తరం వైపు ముఖం గల ఇల్లు గానీ, వ్యాపార సంస్థగాని కలసివస్తుంది. వీరకి 2,7,11,16 తేదీలు, సోమవారం వస్తే బాగా కలసి వస్తుంది. ఈ తేదీలలో ఏ పని తలపెట్టినా వీరికి విజయం వరిస్తుంది.

వీరు శివుని గాని, సుబ్రహ్మణ్యేశ్వర స్వామి వారిని గాని ఆరాధించితే అభివృద్ధి పొందుతారు.

## మూడవ సంఖ్య

జ్యోతిష్య శాస్త్రానికి, సంఖ్యాశాస్త్రానికి కూడా కారకుడు గురుడు. ఈ 3వ సంఖ్యకు అధిపతి గురుడు.

గురుడుకు మరో పేరు బృహస్పతి. బృహస్పతి దేవతలకు గురువు. విద్యాకారకుడు, ధన కారకుడు అవడం వల్ల నవగ్రహాలలో గురువుకు మంచిస్థానం ఇవ్వబడింది. పునర్వసు, విశాఖ, పూర్వాభాద్ర నక్షత్రాలకు కూడా గురువు అధిపతి.

ఏ సంవత్సరములోనైనా, ఏ మాసంలోనైనా 3,12,21,30 తేదీలలో జన్మించిన వారందరికి జన్మ సంఖ్య 3గా అవుతుంది.

3వ సంఖ్యగలవారు ఎత్తుగా, ఆకర్షణీయంగా, పెద్దదైన నుదురుతో చక్కటి కనుపాపలతో చక్కని శరీర ఛాయగలవారై ఉంటారు.

ఈ సంఖ్య గలవారు కూడా 1వ సంఖ్యగలవారి వలే నాయకత్వ లక్షణాలను ఎక్కువగా కలిగి ఉంటారు. ఆరు నూరైనా ఒకరి క్రింద పనిచేయడం వీరికి ఇష్టం ఉండదు. ఇతరుల మీద అధికారం చెలాయించడానికి కావలసిన తెలివితేటలు, శక్తి సామర్థ్యాలను కలిగి ఉంటారు.

వీరి మనోభావాలు ముఖంలో ప్రస్ఫుటంగా కనబడుతుంటాయి. ఆర్థిక విషయంలో విపరీతమైన ఆసక్తి గలవారైనప్పటికీ, ధనాన్ని విరివిగా ఖర్చు చేస్తుంటారు. వీరికి అందరి మీద ప్రేమ, వాత్సల్యం ఉంటుంది.

వీరి ప్రవర్తన ధర్మయుక్తంగానూ, శాసనబద్ధంగానూ, సక్రమమైందిగానూ ఉంటుంది. చట్టాన్ని అతిక్రమించి ప్రవర్తించడానికి అంగీకరించరు. తమ ధర్మసందేశాలను ప్రజలకు బోధిస్తూ, ప్రజాశ్రేయస్సుకు పాటుపడతారు.

వీరు జీవితంలో నిదానంగా, స్థిరంగా అభివృద్ధిని సాధిస్తారు. వీరికి ఉన్నతస్థాయి బంధుమిత్రుల అండదండలు పుష్కలంగా ఉంటాయి.

వీరి ఆరోగ్యం, దేహధారుడ్యం చక్కగా ఉంటాయి. అయితే తరచుగా అనుకోని ప్రమాదాలకు లోనవుతుంటారు. చాలాసార్లు మృత్యుముఖం నుండి చాకచక్యంగా తప్పించుకోగల్గుతారు.

వీరు తాము చేసే వ్యాపారమందుగాని, మరింకే ఇతర వృత్తిలో ఉన్నాగాని, విశేష అభివృద్ధిని పొందుతారు. సైనిక శాఖలోగాని, నావికాశాఖలోగాని, రాజకీయ ఉద్యోగం అయినా సరే తమ తెలివితేటలతో పనిచేయగల శక్తి సామర్థ్యాలు ఉంటాయి.

3వ సంఖ్యగలవారికి స్నేహితులు ఎక్కువగా ఉంటారు. ఇతరులకు మంచి సలహాలను, సహాయాన్ని అందిస్తారు. ప్రతి విషయాన్ని గురించి తరచి తరచి ఆలోచించే వీరు, ఇతరులకు సలహాలు ఇవ్వడంలో మంచి నేర్పరులుగా ఉంటారు.

ప్రతి విషయాన్ని ఎదుటివారికి అర్థమయ్యే రీతిలో విశదీకరించి చెప్పే స్వభావం గల వీరికి విద్యా, వృత్తులలో ప్రత్యేకస్థానం ఉంటుంది.

ఉద్యోగంలో ఒక్కరినే ఆశ్రయించి ఉండటం, స్వతంత్ర జీవితం గడిపేందుకు వీరికి అధికమైన ఇష్టం. రాజకీయరంగంలో వీరు మంచి పేరు ప్రఖ్యాతులు పొందగలరు.

తమ కుటుంబంలోని వ్యక్తుల పట్ల, ముఖ్యంగా పిల్లల పట్ల ఎంతో ప్రేమానురాగాలను కలిగి ఉంటారు. కుటుంబ సంరక్షణ, పోషణ వీరు బాధ్యతగా నిర్వహిస్తారు. దాన్ని ఒక పవిత్ర కార్యంగా భావిస్తారు. కుటుంబంలోని వృద్ధుల కోసం వీరు తమ స్వసుఖాలను కూడా త్యాగం చేస్తారు.

వీరికి భక్తిశ్రద్ధలు అధికంగా ఉంటాయి. నీతి నియమాల పట్ల జాగురూకతతో ఉంటారు. ఎంతటి శ్రమనైనా సరే వెంటనే మరిచిపోవడం వీరి స్వభావం. ప్రతి సమస్యను తెలివిగా ఎదుర్కోవడం వీరి స్వభావం.

3వ సంఖ్యగలవారికి దేశాటన ఇష్టమైన హాబీ. దేశ విదేశాల్లోని ఎన్నో ప్రసిద్ధ ప్రదేశాలను వీరు చూస్తారు. ఈ ప్రయాణాల్లో పరిచయమైన వ్యక్తుల ద్వారా జీవితంలో వీరికి ఆర్థికపరమైన ప్రయోజనాలు కూడా కలుగుతాయి.

వీరు వ్యాపారంలో తమ వ్యక్తిగత ఆకర్షణ ద్వారా చక్కని పురోగతిని సాధిస్తారు. వీరి స్వీయ ప్రతిభ ద్వారా ధనం సంపాదిస్తారు.





ప్రభుత్వ సర్వీసులు, ట్రావెల్ అండ్ టూరిజం, రక్షణరంగం, ఇంపోర్ట్ – ఎక్స్‌పోర్ట్, ఉన్నత విద్య, విదేశీ భాషలు, పరిశోధన, ప్రచురణ, పబ్లిసిటీ, ఔషధాలు, ఫైనాన్స్ అండ్ బ్యాంకింగ్, సైన్స్ అండ్ టెక్నాలజీ మీద పనిచేసే సంస్థలు, న్యాయశాస్త్రం, రక్షణ కర్మాగారాలు, క్రీడలు, జ్యూయలరీ, మత ధార్మిక తత్త్వ స్వచ్ఛంధ సేవాసంస్థలు వంటి రంగాల్లో ఈ 3వ సంఖ్యగలవారు బాగా రాణిస్తారు.

వీరు ప్రశాంతమైన, ప్రేమపూర్వక వాతావరణాన్ని తమ జీవితంలో ఉండేటట్లు కోరుకుంటారు. వివాదాలకూ, లిటిగేషన్లకూ సాధ్యమైనంత దూరంగా ఉంటారు. ఎల్లప్పుడూ మంచి ఉద్దేశ్యంతో సాయపడటానికి సిద్ధంగా ఉంటారు.

ఎన్నో విషయాలపై అలిగిన తమ స్నేహితులను, బంధువులనూ శాంతపర్చడానికి వీరు తరచుగా తమ జేబులోని ధనాన్ని ఖర్చు చేస్తారు.

తమ మధ్య వయస్సులో అంటే 32–48 సంవత్సరాల కాలం వీరికి బాగా కలిసి వచ్చేకాలం. 48 సంవత్సరాల వయస్సు వచ్చేసరికి వీరు ఉన్నత శిఖరాలను చేరుకుంటారు.

3వ సంఖ్యగలవారు విలాసాలకై మితిమీరిన ఖర్చు పెట్టకూడదు అనేది వీరు బాగా గుర్తుపెట్టుకోవాలి.ఎందుకంటే అసలు వీరి స్వభావంలోనే ఎక్కువ ఖర్చుచేసే తత్త్వం ఉంది.

వీరికి దురహంకారం, సోమరితనం, నియంతృత్వ పోకడలు, అత్యాశ – దురాశ, ఎక్కువ కోపం వీరి బలహీనతలుగా చెప్పుకోవచ్చు.

ఆధ్యాత్మిక చింతనాపరులైన వీరు దేవాలయాలకు ట్రస్ట్ సభ్యులుగా కూడా ఉండే అవకాశముంది. వీరికి మధ్యవర్తిత్వం, సంగీతం, సాహిత్య సత్కారముల పట్ల ఎక్కువగా ఇష్టం ఉంటుంది.

ఈ సంఖ్యకు చెందినవారు ఎక్కువగా రచనా రంగంలో అడుగుపెట్టే అవకాశ ముంది. వీరికి పట్టుదల ఎక్కువ. తమ మాటల్ని అవతలివారు విన్నారా? లేదా? అని తరచూ అనుమానానికి గురయ్యే వీరు అప్పుడప్పుడు చెప్పిన దానినే తిరిగి మరలా చెప్పడం జరుగుతుంటుంది.

## వివాహ జీవితం - ఆర్థిక పరిస్థితులు

వీరి వివాహ జీవితం చాలా సుఖసంతోషాలతో సాగిపోతుంది. ప్రేమ విషయాలు వీరికి అంతగా అనుకూలించవు. వీరి భాగస్వామిగా లభించేవారు సదాచార సంపన్నులు, సత్ప్రవర్తన గలిగినవారై ఉంటారు.

3వసంఖ్యగలవారు 2,6,8,9 సంఖ్యలకు చెందినవారిని వివాహమాడితే చాలా బాగుంటుంది. వీరికి మగ సంతానం అధికం. వీరి కుటుంబ జీవనం సుఖమయంగా సాగుతుంది.

వీరు ఆర్థికంగా బాగా పుంజుకునే అవకాశం ఉంది. కానీ ఎంత సంపాదించినా చేతిలో పైసా మిగలదు.

కానీ వీరు చేసే ఖర్చులు సద్వినియోగమవుతాయి. విద్యాలయాలకు, దేవాలయాలకు ఖర్చు ఎక్కువగా చేస్తారు. పేద విద్యార్థులకు సాయం చేయడంలో కూడా ముందుంటారు.

అన్నిమాసములందు 3వ సంఖ్య వచ్చే తేదీలు 3,12,21,30 తేదీలు వీరికి చాలా అనుకూలంగా ఉంటాయి.

విశేషించి ఫిబ్రవరి 19 నుండి మార్చి 27 వరకూ, నవంబర్ 21 నుండి డిసెంబర్ 27 వరకూ ఈ మధ్యగల తేదీలలో గురుడు విశేష బలసంపన్నుడుగా ఉంటాడు గనుక ఈ తేదీలలో లాభదాయకంగా, శుభదాయకంగా, అనుకూల దాయకంగా ఉంటుంది.

మంగళవారం, గురువారం, శుక్రవారం వీరికి చాలా అనుకూలమైన వారములు. గురువారం విశేషంగా అధిక శుభఫలదాయకంగా ఉంటుంది.

గురువారంలో 3,12,21,30 తేదీలు వస్తే, ఆ రోజులలో విశేషధనలాభం, శుభవార్తలు, చేసే ప్రయత్నాలలో జయం, సౌఖ్యం కలుగుతుంది.

వీరికి 6,9 తేదీలు కూడా చాలా అనుకూలమైన తేదీలు. 6,9 తేదీలు మాత్రమేగాక, మొత్తం కలపగా 6గాని, 9 గాని వచ్చు తేదీలు, అనగా 15,18,24,27 తేదీలు కూడా శుభఫలములను కలుగజేస్తాయి.

మార్చి, జూన్, సెప్టెంబరు మాసాలు 3 గాని 9 గాని వచ్చే సంవత్సరాలు వీరికి విశేషలాభదాయకంగాను, అనుకూలదాయకంగాను, నూతన శుభములను కలుగజేసేదిగా ఉండును.

అటువంటి సంవత్సరాలలో వీరికి ఉద్యోగప్రాప్తం, ఉద్యోగాభివృద్ధి, నూతన వ్యాపార ప్రారంభం, వ్యాపారం మూలంగా విశేషధనలాభం, భూగృహప్రాప్తి, సంతానప్రాప్తి, స్త్రీ సౌఖ్యం కలుగుతుంది.

వీరికి పసుపు పచ్చరంగు, నీలంరంగు చాలా అనుకూలమైనవి. పసుపుపచ్చ నీలం రంగు రాళ్ల ఉంగరాలను ధరించడం వలన శత్రుజయం, కార్యజయం కలుగుతుంది.





మరియు పుష్యరాగం, వైఢూర్యం రాళ్లు ధరించడం వల్ల సర్వకార్యము లందు శుభము కలుగుతుంది. పసుపురంగు వస్తువులన్నీ వీరికి అనుకూలమైనవి.

3వ సంఖ్యకు గురుడు అధిపతి అవడంతో గురువు యొక్క లక్షణాలు ఈ వ్యక్తులు కలిగి ఉంటారు. వీరు ధన సంపాదన కంటే, పేరుప్రతిష్టలు సంపాదించడానికి కృషి చేస్తుంటారు. మొత్తం మీద వీరి జీవితం ఎప్పుడూ ఒకే విధంగా ఉండకుండా ఒక్కొక్కప్పుడు ఉచ్ఛస్థితిని పొంది, ఒక్కొక్కప్పుడు చాలా తక్కువ స్థితికి వస్తుంటుంది.

## నాలుగవ సంఖ్య

ఈ 4వ సంఖ్యకు అధిపతి రాహువు. రాహువు రవికి మిత్రుడు. జ్యోతిష్యశాస్త్రంలో మేషాది ద్వాదశి రాశులందు రాహువుకు స్థానము ఎక్కడా లేకపోయినప్పుడు, రవి రాహువుకు తన స్వక్షేత్రమైన సింహరాశియందు స్థానమిచ్చాడని ఒక కథ ఉంది.

ఆ విధంగా రవి, రాహువులకు స్నేహమేర్పడింది. అందుకే 1వ సంఖ్యకు అధిపతి యగు రవికి 4వ సంఖ్యకు కూడా ఒక విధంగా ఆధిపత్యం కలిగింది.

ఏ సంవత్సరంలోనైనా, ఏ మాసంలోనైనా 4,13,22,31 తేదీలలో జన్మించిన వారు 4వ సంఖ్యకు చెందుతారు. ఆరుద్ర, స్వాతి, శతభిషా నక్షత్రాలకు చెందిన వారు కూడా ఈ 4వ సంఖ్యకే చెందుతారు.

ఈ సంఖ్యకు చెందిన వారు సుమారైన ఎత్తులో, విశాలమైన నేత్రాలతో, గుండ్రని భుజాలతో వినయం, అణకువని కలిగి ఉంటారు. అందరితో ఎంతో ప్రేమానురాగాలు కలిగి ఉంటారు.

కష్టించి పనిచేసే స్వభావం గల వీరు అల్ప సంతోషులు. కాస్త పొగిడితే చాలు పొంగిపోతారు.

మంచి వ్యవహార దక్షులు, భక్తి గలవారు. సున్నిత మనస్కులైనప్పటికీ అప్పుడప్పుడు కొంత మొండి వైఖరిని ప్రదర్శిస్తుంటారు.

4వ సంఖ్యవారు నీతి నియమాల పట్ల నిబద్ధతను పాటిస్తూ, ఆత్మ గౌరవానికి అధిక ప్రాముఖ్యత నిస్తారు. ఎక్కువగా సందేహాస్పదులైన ఈ సంఖ్య గలవారు ఏ విషయాన్ని అయినా బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వస్తారు.

ఈ 4వ సంఖ్య గలవారి స్వభావం మరియొక విధంగా ఉంటుంది. వీరు ఎల్లప్పుడూ ఇతరులతో ఏకీభవించకుండా వ్యతిరేకంగా ప్రవర్తిస్తుంటారు. అందువలన వీరికి కాలక్రమేణా శత్రువులు పెరుగుతుంటారు.

వీరు ప్రభుత్వ చట్టాలకి కూడా వ్యతిరేకంగా ప్రవర్తించడానికి వెనుకాడరు. గృహ విషయాలలో, బయట విషయాలలో కూడా పాత పద్ధతుల్ని వదిలిపెట్టి కొత్త పద్ధతుల్ని పాటించడానికి ప్రయత్నిస్తారు.

చంచల మనస్కులైన వీరు కొన్ని సమయాలలో అత్యుత్సాహంతో, కొన్ని సమయాలలో నిరుత్సాహంగా కనపడతారు. వీరి వాక్చాతుర్యం, ప్రవర్తన వల్ల ఇతరులకు ఎంతో ఇష్టమైన వారుగా ఉంటారు.

4వ సంఖ్యగలవారు సకల సౌకర్యాలు, అనుభవిస్తున్నా ఇంకా ఏదో వెలితి, అసంతృప్తి, వీరిని వెంటాడుతుంటుంది. పూర్వీకుల వల్ల లభించిన సంపద వల్ల వీరు ఎక్కువగా లాభం పొందుతారు.

వీరిలో కుండలినీ శక్తి ప్రభోదనం చెంది ఉంటుంది. మంత్ర, తంత్ర శాస్త్రాలపై నమ్మకం కలిగి ఉంటారు.

వీరు ఆత్మ విశ్వాసం పెంపొందించుకున్నట్లయితే ఎలాంటి సమస్య అయినా ఛేదించగలుగుతారు.

వీరు ఉన్నత స్థానాలను తేలిగ్గా పొందగలుగుతారు. ఆకస్మిక ధనలాభం, లాటరీ వంటివి వీరికి తరచుగా తగులుతుంటాయి. అయినా అత్యవసరాల కోసం ధనానికై వెతుకులాడుతూనే ఉంటారు.

4వ సంఖ్యగలవారు ఎలా సంపాదిస్తారో అలాగే ఖర్చు చేసేస్తారు. ఏ చిన్న పనికైనా వీరు ఎక్కువగా శ్రమపడాల్సి ఉంటుంది. జూదం, స్పెక్యులేషన్ వంటి త్వరగా ధనం సంపాదించే మార్గాలవైపు వెళ్ళకుండా ఉండడం మంచిది.

ఈ సంఖ్యగలవారు చేస్తున్న ఉద్యోగంతో సంతృప్తి పడకుండా తరచు ఉద్యోగాలు మారుతుంటారు. ఇది వారి జీవితకాలంలో 6 నుండి 10 సార్లు వరకూ జరగవచ్చు. అయితే వీరు ఉద్యోగం మారే సందర్భంలో ఈ పనిలోంచి ఇంకో పనిలోకి అని కాకుండా ప్రయోజనం గల ఉద్యోగం చూసుకుని మారడం మంచిది.

4వ సంఖ్యగలవారు ఆలస్యంగా వివాహం చేసుకోవడం చాలా మంచిది. మగవారు 26 సంవత్సరాలు దాటాక, ఆడవారు 22 సంవత్సరాలు దాటాక వివాహ మాడటం వల్ల మంచి ఫలితాలను పొందగలరు.

వీరు తమ యవ్వన ప్రాయంలో అతిగాఢంగా ప్రేమిస్తారు. అయితే ఈ ప్రేమ వ్యవహారం పెళ్ళి దాకా వెళ్లే అవకాశం ఉండకపోవచ్చు. సహజంగా వీరు సరస హృదయులు. తమ ప్రేమ వ్యవహారాలను రహస్యంగా ఉంచుతారు.





స్వయంకృతం వలనో, భగవంతుడి లీల వలనో, కొన్ని మనస్పర్థలు కారణంగా పెళ్లి దాకా వచ్చిన ప్రేమ వ్యవహారాలు బెడిసికొడతాయి. మానసికంగా తీవ్రమైన సంఘర్షణకు లోనవుతుంటారు.

వీరికి 8,9 సంఖ్యగలవారితో వివాహం పనికిరాదు. 4వ సంఖ్యగల మగవారు 9వ సంఖ్యగల స్త్రీని వివాహమాడితే ఆ దంపతులకు వియోగం తప్పదు. ఎక్కువ మంది దంపతులు విడిపోవడం, ద్వితీయ వివాహానికి దారితీయడం జరుగుతుంది.

వీరికి 4,13,22,31 తేదీలు చాలా అనుకూలమైనవి. చంద్రుడు బలంగా ఉండు కాలమైన జూలై 21 నుండి ఆగస్టు 30వ తేదీల మధ్య రవి బలంగా ఉండే కాలమైన జూలై 21 నుండి ఆగస్టు 30వ తేదీల మధ్య వచ్చు 4,13,22,31 తేదీలు వీరికి ఇంకా విశేష శుభప్రదమైనవిగా ఉంటాయి.

వీరికి ఆదివారం, సోమవారం, శనివారం చాలా అనుకూలమైనవి. అందుకే ఆదివారం,సోమవారం, శనివారాలలో ఏ రోజు అయిననూ 4,13,22,31 తేదీలు కలసి ఉంటే ఆ రోజు వీరికి విశేష బలమైన శుభాలు కలుగుతాయి.

4వ సంఖ్య గల వారికి 1,2,7 అనుకూల సంఖ్యలనీ, అనుకూలమైన తేదీలని చెప్పబడుచున్నవి.

ఏ పనిలో అయినా అపజయం కలిగితే చాలా నిరుత్సాహంగా, విచారంగా ఉంటారు. ప్రతి చిన్న విషయానికి ఆవేదన చెందుతుంటారు. ఎప్పుడూ ఒంటరిగా ఉండటానికి ఇష్టపడేవారుగా ఉంటారు.

అందుకే వీరికి స్నేహితులు తక్కువగా ఉంటారు. ఉన్న కొద్దిమంది స్నేహితులతో మాత్రం ప్రేమగా ఉంటారు.

మొత్తం మీద వీరి స్వభావం లోకవిరుద్ధంగా కనబడుతుంది. గృహజీవితంలోనూ, మత విషయాలలోనూ, ఇతరములైన విషయాలలో కూడా వీరి ప్రవర్తన లోకవిరుద్ధంగా కనబడుతుంది.

ముదురు రంగులు కాకుండా, లేత రంగులు వీరికి అనుకూలమైనవి. నీలం రంగు రాళ్లు ధరించడం చాలా మంచిది.

## వివాహ జీవితం - ఆర్థిక పరిస్థితులు

వీరికి కుటుంబ బరువు బాధ్యతలు ఎక్కువగా ఉండటంతో, వీరి వివాహం కాస్త ఆలస్యంగా జరుగుతుంది.

ఈ సంఖ్యగల స్త్రీలకు వివాహానంతరం మరిన్ని బరువు బాధ్యతలు నెత్తిమీద పడతాయి. కుటుంబ జీవితం చాలా సామాన్యంగా ఉంటుంది. వివాహ జీవితంలో విబేధాలు తలెత్తే అవకాశముంది.

అయినప్పటికీ ఆ సమస్యలను తెలివిగా పరిష్కరించుకోగలుగుతారు. ఈ 4వ సంఖ్య గలవారు 1,2,6 సంఖ్యగలవారిని పెళ్ళి చేసుకోవడం శుభకరం.

అడిగిన వెంటనే ఇతరులకు సహాయం చేసే ఉదార స్వభావులు వీరు. తన వాళ్ళనుకున్న వారికి ప్రాణాన్ని సైతం ఇవ్వడానికి సిద్ధపడే వీరికి, తన వాళ్లనుండే సమస్యల ఎదురవడం జరుగుతుంది. వీరికి రాజకీయ, కళారంగాలలో మంచి అభివృద్ధి ఉంటుంది.

వీరిలో చాలామంది లాయర్లుగా, కమీషన్ ఏజెంట్లుగా రాణిస్తారు. ఈ సంఖ్య గలవారికి తూర్పు, దక్షిణ దిక్కులు కలసి వస్తాయి.

వీరికి లేత పసుపురంగు, బూడిద, తేనె రంగుల దుస్తులు కలసివస్తాయి. వెండి ఆభరణాలు కలసి వస్తాయి.

వీరికి 1,2,10,11,19,20 తేదీలు బాగా కలసివస్తాయి. శనివారం, ఆదివారం సోమవారాల్లో ఏ పని తలపెట్టినా కలసివస్తుంది.

కనకదుర్గ అమ్మవారిని పూజిస్తే మంచి జరుగుతుంది.

మొత్తంమ్మీద వీరి జీవితం ఎల్లప్పుడూ ఆర్థిక చిక్కులతో నిండి ఉంటుంది. అనగా ఎప్పుడూ ధనం కోసం చిక్కులు పడుతుంటారు. ఎంత ధనం లభించినను అది వెంటనే ఖర్చు అయిపోతుంది. చేతిలో ఎప్పుడూ ధనం నిలవదు.

కానీ ఎప్పుడూ తీరక లేకుండా ధనార్జనకై పగలు, రాత్రి ఏదో ఒక పని చేస్తూ ఉంటారు. సంపాదన కూడా బాగానే ఉంటుంది. కాని ఆర్థిక చిక్కులు తప్పవు.

## అయిదవ సంఖ్య

ఈ 5వ సంఖ్యకు బుధుడు అధిపతి. బుధుడు జ్యోతిషశాస్త్ర రీత్యా వైశ్యాగ్రహము అగుచున్నాడు. అంటే వైశ్యులకుండు స్వభావం, లక్షణాలు, 5వ సంఖ్యగల వారి యందు ఎక్కువగా ఉంటాయి.

ఏ సంవత్సరంలోనైనా, ఏ మాసంలోనైనా 5,14,23 తేదీలలో జన్మించి వారు 5వ సంఖ్యగల వారవుతారు.

మన పురాణాల శాస్త్రం ప్రకారం పంచభూతాలు, పంచేంద్రియాలు, పంచలోహాలు, పంచాంగములు మొదలైన వాటివల్ల అయిదవ సంఖ్యకు





అతిప్రాముఖ్యత లభించింది. విజ్ఞానం, శాస్త్రజ్ఞానం, వ్యాపార జ్ఞానం గల బుధుడు, ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి నక్షత్రాలకు అధిపతిగా ఉన్నాడు.

ఈ 5వ సంఖ్యకు చెందిన వారు ఎత్తుగా, మంచి దృఢమైన భుజాలు గలవారుగా ముఖ్యంగా చేతులు, కాళ్లు కొంత పొడవుగా కనబడుతుంటాయి. వీరికి విశాలమైన నేత్రాలుంటాయి. వీరి అభిప్రాయాలను వీరి నేత్రముల ద్వారా మనం గ్రహించవచ్చు.

వీరు సామాన్యమైన రంగు కలిగి ఉంటారు. వీరికి శరీర బలం కంటే బుద్ధి బలం ఎక్కువగా ఉంటుంది. వీరికి మంచి శాస్త్రజ్ఞానం, చదువుపై ఎక్కువగా ఇష్టం. వాక్ చాతుర్యం ఆర్థికంగా ఉంటుంది.

తమ ఆలోచనలను త్వరితగతిన మార్చుకునే స్వభావం గల వీరు ఎదుటి వారి ఆలోచనలను ఇట్టే గ్రహిస్తారు. మంచి పట్టుదల, అధికమైన కోపం వచ్చిన వెంటనే కోపం పోయేవారుగా ఉంటారు.

వీరు ప్రతివారితోను కలసి మెలసి ప్రవర్తిస్తుంటారు. ఎటువంటి వారినైనను సులభంగా తమ వశం చేసుకునే శక్తి సామర్థ్యాలు కలిగి ఉంటారు. అందుచేత మొత్తం మీద వీరికి మిత్రులు ఎక్కువగా ఉంటారు.

వీరు గొప్ప మేధావంతులుగా ఉంటారు. వీరు తలపెట్టిన ప్రతిపనిని ఉద్రేకం గానూ, ఉత్సాహంగాను చేస్తుంటారు.

ఎటువంటి పనైనా త్వరగా నిర్విఘ్నంగా పూర్తి చేయగల శక్తి సంపన్నులుగా ఉంటారు.

వీరు చురుకుగా, వేగంగా ప్రతిస్పందించే స్వభావం కలవారు. ధనం సంపాదించే కళ వీరి నుండే నేర్చుకోవాలి. స్పెక్యులేషన్‌లో వీరిది అందె వేసినచెయ్యి. ఇబ్బడి ముబ్బడిగా ధనం పోగు చేస్తారు.

అందువల్ల ముందు ముందు ఆర్థికపరమైన ఇబ్బందులు వచ్చినా దాటి ఉంచిన ధనం ఈ సందర్భంలో ఆదుకుంటుంది.

5వ సంఖ్యగలవారు స్వభావ సిద్ధంగా పిసినారులు. ప్రతిపైసా ఆచితూచి ఖర్చు చేస్తారు. ఇలాంటి స్వభావం వీరి సుఖమయ జీవితం మీద ప్రభావాన్ని చూపుతుంది.

వీరు వైవిధ్యభరితమైన దృక్పథంతో స్ఫూర్తివంతంగా మాట్లాడతారు. సమ్మోహనమైన వ్యక్తిత్వంతో పలువురిని ఆకట్టుకుంటారు. ఉల్లాస పూరితంగా ఉన్నది ఉన్నట్టు మాట్లాడటం వీరి అలవాటు.

5వ సంఖ్య గలవారు త్వరగా అందరితో కలసిపోతారు. ధనం విషయంలో, వ్యవహారాల్లో వీరిది అదృష్టసంఖ్య. పెద్ద మొత్తంలో ధనం వీరు సంపాదించగలుగుతారు. అందువల్ల ముఖ్యంగా వీరు వ్యాపారంలో భాగస్వాముల పట్ల అతిజాగ్రత్తగా వ్యవహరించడం చాలా మంచిది.

విమర్శలకు అతీతంగా, చురుకుగా, క్రమశిక్షణతో పొరపాట్లు జరుగని విధంగా తన కర్తవ్యాన్ని పూర్తిచేస్తారు.

తమ తప్పులను తాము తెలుసుకునే స్వభావం గలవారిగా, ఎదుటివారిని తొందరపడి బాధించు స్వభావం లేనివారుగా, ఎదుటి వారి మోసాలు మోసం అని తెలిసినా, తేలికగా లొంగిపోయే వీరు ఉన్నట్లుండి వేదాంత ధోరణిని చూపెడతారు.

వీరు పరులకు అడిగిన వెంటనే సహాయ సహకారాలు అందిస్తూ, ఎదుటివారి కష్టాలను చూసి కరిగిపోతుంటారు. అనవసరమైన ప్రసంగాలపై ఇష్టం లేని వీరిని పొగడ్తలతో లొంగదీసుకోవడం కష్టం.

వీరికి బంధుప్రీతి ఎక్కువ. బంధువర్గంలో వీరిని తక్కువగా చూసే వారున్నప్పటికీ వీరు స్వయంకృషితో పైకొచ్చి, ఎవరైతే తక్కువ చూపు చూసారో ఆశ్చర్యపోయే విధంగా అభివృద్ధి చెందుతారు.

వీరు ధన సంపాదన మార్గాలను కనుగొనటంలో అతి నిపుణుల్లాగ ఉంటారు. వ్యాపారమందు విశేష నేర్పరితనంగా ఉంటారు. వీరు ఒక వ్యక్తిని నమ్మితే ఎప్పుడూ ఆ వ్యక్తిని వదలకుండా నమ్మకంతోనే ఉంటారు.

5వ సంఖ్యగలవారు వర్తకులుగా, వైద్యులుగా, ఉపన్యాసకులుగా, కవిత్వం చెప్పేవారుగా, న్యాయవాదులుగా ఉంటారు.

జీవితానికి సంబంధించిన పథకాలు వేయడంలో నిష్ణాతులైన వీరు జీవితంలో స్థిరపడటం కొంత ఆలస్యం అయినా, మంచి స్థితిలో స్థిరపడతారు.

5వ సంఖ్యగల స్త్రీలు బ్యూటీపార్లర్లు, ఆరోగ్య కేంద్రాలు, ఇంటీరియల్ డెకరేషన్, టెక్స్‌టైల్స్, ఫ్యాషన్ డిజైనింగ్ వంటి రంగాల్లో బాగా రాణిస్తారు. మగవారు బ్యాంకింగ్, జీవిత భీమా, ఇంజనీరింగ్, జర్నలిజం వంటి రంగాలు కలసి వస్తాయి.

5వ సంఖ్య గలవారు ప్రేమ వ్యవహారాలు నడపటంలో మంచి ప్రావీణ్యం కలవారు. చక్కని సౌష్టవంతో, ఆకర్షణీయమైన చూపులతో, సునిశిత పరిశీలనా దృష్టితో వీరు ఆడవారిని యిట్టే ఆకట్టుకుంటారు.





వీరికి వస్తువులంటే ఇష్టం కంటే బట్టలను శుభ్రంగా ధరించడమంటే చాలా ఇష్టం.

వీరు ఎవరితోనూ విభేదించడానికి ఇష్టపడరు. ఊహించని పరిస్థితులలో స్నేహితులతో అభిప్రాయబేధాలు తలెత్తినా, సామరస్యంతో ముందుకు వెళ్లేందుకు ప్రయత్నిస్తారు. ఏకాంతంగా గడపడమంటే ఇష్టపడేవీరికి ఎప్పుడూ పనిచేస్తూ కాలం గడపడమంటే చాలా ఇష్టం.

## వివాహజీవితం - ఆర్థిక పరిస్థితులు

5వ సంఖ్య గలవారికి దాంపత్య జీవితం సామాన్యమైన సంతృప్తిని మాత్రమే కలిగిస్తుంది. వీరి సహచరికి వీరిపై అధికమైన అభిమానం ఉంటుంది. అప్పుడప్పుడు దంపతుల మధ్య అభిప్రాయ బేధాలు తలెత్తుతుంటాయి.

అయితే వీరి భార్య సామరస్యంతో ముందుకు వెళ్ళడం వలన సమస్యలు తేలికగా పరిష్కరింపబడతాయి. వీరికి వివాహ జీవితం కన్నా, వివాహం కాకుండా ఉండడమే మేలు అని అనిపిస్తూ ఉంటుంది.

వీరు ఒక్కొక్కసారి ఎక్కువగా వేదాంత ధోరణి అవలంభించడం వల్ల కుటుంబంలో మౌనపోరాటం ఎక్కువగా ఉంటుంది.

కుటుంబంలో వీరివల్ల అశాంతి తలెత్తడానికి అస్కారముంది. వీరు 2,6,9 సంఖ్యల గలవారిని వివాహం చేసుకుంటే సమస్యలు వాటంతటవే పరిష్కరింపబడతాయి.

ఆర్థిక విషయంలో సంతృప్తిగా సాగుతుంది. అధికమైన తెలివి తేటలు ఉండడం వల్ల వీరికి సంతృప్తికరమైన ఆర్థిక పరిస్థితి ఉంటుంది.

వీరికి 1,5,7 అదృష్ట సంఖ్యలు. ఏ వ్యాపారం చేసినా ఈ సంఖ్యలు కలసి వచ్చేలా చూసుకుంటే అభివృద్ధి చెందుతారు.

ఈ 5వ సంఖ్య గలవారు ఒక విధమైన మనోశక్తితో ఉంటారు. తమను చూడగోరే వారు తమ నుండి ఏం ఆశిస్తున్నారో ఖచ్చితంగా పసిగట్టగలరు. ఎంతటి విషాదాన్నయినా  చిరునవ్వుతో సహిస్తారు.

వీరు తొందరపడి తాత్కాలిక నిర్ణయాలు తీసుకోవడం వల్ల ప్రేమ, వివాహం, లాంటి వ్యక్తిగత విషయాల మీద తీవ్రమైన ప్రభావాన్ని చూపెడతాయి. అందువల్ల ప్రశాంతంగా ఆలోచించి ఒక మంచి నిర్ణయం తీసుకోవడం మంచిది.

వీరు సరైన వయస్సులో వివాహం చేసుకోవడం చాలా మంచిది. ఆ వివాహం వలన వీరికి బాగా కలసి వస్తుంది. వీరి నిర్ణయాలు చాలా గట్టిగా

ఉంటాయి. భగవంతుడు తప్ప వేరెవరూ వీరు తీసుకున్న నిర్ణయాలని మార్చడం కుదరదు.

5వ సంఖ్య గలవారు అంతగా విద్యలేని జాతకులు అయినా ఆర్థికంగా మంచి స్థితిని పొందుతారు. సంపాదించేదంతా కుటుంబం కోసం ఖర్చు పెట్టే వీరికి పొదుపు చేయాలన్న ఆలోచన రాదు.

ఒక్కోసారి ఊహించని ఖర్చులు వీరి అంచనాలను దాటుతుంటాయి. ఉద్యోగస్తులకు సంతృప్తిగా ఉంటుంది.

ఈ సంఖ్యలో జన్మించిన వారు చాలా ప్రఖ్యాతి గాంచిన వారుగా ఉంటారు. వీరు వృత్తులలో, అనగా ఉపాధ్యాయ వృత్తిలో గాని, కళారంగంలో గాని, ఆడిటర్లు గానీ మంచి ఖ్యాతి గడిస్తారు.

వీరికి నరాల బలహీనత, తలకు సంబంధించిన అనారోగ్యం ఎక్కువగా రావచ్చు. వీరి 24,27,35 సంవత్సరాలలో ఊహించని అభివృద్ధిని పొందుతారు.

వీరికి బుధవారం, శుక్రవారం అనుకూలమైన వారాలు. ఉత్తర దిక్కుగల ఇల్లు గానీ, సంస్థలు గానీ కలిసి వస్తాయి.

వీరికి అదృష్టాన్నిచ్చే రత్నం జాతి పచ్చ, మయూరి మరకతం, గరుడ పచ్చవంటివే కాక వజ్రం కూడా వీరు ధరిస్తే శుభం కలుగుతుంది.

వీరికి ఆకుపచ్చ, తెలుపు, లైట్ రంగులు గల దుస్తులు కలసి వస్తాయి. వీరికి 5 సంఖ్య అదృష్ట సంఖ్య.

వీరికి ఎక్కువగా 2,5,14,23 తేదీలు శుభకరం. ఈ తేదీలలో బుధవారం, శుక్రవారం వస్తే చాలా అనుకూలంగా ఉంటుంది.

వీరు ఎక్కువగా గాయత్రి, వేంకటేశ్వర స్వామి పూజలు చేస్తే శుభం కలుగుతుంది.

## ఆరవ సంఖ్య

ఈ 6వ సంఖ్యకు శుక్రుడు అధిపతి. భరణి, పుబ్బ, పూర్వాషాడ, నక్షత్రాలకు కూడా అధికుడు శుక్రుడు.

వారాలలో శుక్రవారానికి అధిపతి శుక్రుడు. నవగ్రహాలలో శుక్రునికి అతి ప్రాముఖ్యత ఉంది. విద్యా, జ్యోతిష్యం, వైజ్ఞానం, సంగీత సాహిత్యాలకు అధిపతి శుక్రుడు.

ప్రతి మానవుడూ సుఖంగా ఉండాలంటే, ఈ శుక్రుడు శుభంగా ఉంటేనే సుఖసంతోషాలతో ఉంటారు.





ఏ సంవత్సరంలోనైనా, ఏ మాసంలోనైనా 6,15,24 తేదీలలో జన్మించిన వారు 6వ సంఖ్యగల వారవుతారు.

6వ సంఖ్యగలవారు మంచి అందంతో, ఆకర్షణీయమైన కన్నులు గలవారిగా, చూసేవారికి ఆకర్షణీయంగా ఉండేవారై, ఎంతటివారినైనా అతి సులభంగా వశీకరణం చేసుకోగల శక్తి గలవారు.

వీరి స్నేహం కోసం చాలామంది ఎదురుచూస్తుంటారు. వీరి మాట, ధోరణి చాలా ఆకర్షణీయంగా కొంత వింటే, ఇంకా వినాలన్న అభిప్రాయం గలవారుగా ఉంటారు.

వీరు మంచి పట్టుదల, భక్తి గలవారై మంచి తెలివితేటలు గలవారుగా, అందరికీ ఉపయోగపడేవారుగా ఉంటారు.

వీరు తమ ప్రయత్నాలకు ఎటువంటి ఆటంకాలు వచ్చినా లెక్క చేయకుండా కష్టాలన్నిటికీ తట్టుకుని కార్యసాధన అయ్యేవరకు పట్టిన పట్టు వదలరు. వీరు ఎవరిని ప్రేమిస్తారో, వారి కోసం ఏం చేయడానికైనా వెనుకాడరు.

వీరు ధనవంతులైతే పండితులను, శాస్త్రవేత్తలను ఆదరిస్తూ విశేష బహుమానాలతో సత్కరిస్తారు. వీరు ఎప్పుడూ మిత్రులతో కలిసి సరదాగా కాలం గడుపుతారు.

6వ సంఖ్య గలవారికి బంధుమిత్రుల సహాయ సహకారాలు ఎప్పుడూ లభిస్తాయి. అంతేకాకుండా తమకు పరిచయం కాని వ్యక్తుల నుండి కూడా సూచనలు, సహాయం అయాచితంగానే లభిస్తుంటుంది.

వీరు అనుసరించే విధానం 'నిదానమే ప్రధానం'. ఏ పనైనా సరే నింపాదిగా స్థిరంగా పూర్తి చేస్తారు.

కష్టనస్టాలు ఎదురైనా ఓర్పుతో, చిరునవ్వుతో తాము చేయదలచుకున్న పనుల్ని నెరవేరుస్తారు.

గ్రహ స్థితులన్నీ సక్రమంగా ఉంటే వీరు అన్ని రంగాల్లోనూ కీలకమైన స్థానంలో చక్కగా రాణించి తమ ప్రతిభను నిరూపించుకుంటారు. వీరు జీవిత పర్యంతం ఊపిరి సలపని కార్యక్రమాలతో, ప్రయాణాలు, తీరికలేని పనులతో బిజీగా ఉండి ఉంటారు.

వీరికి అన్ని రకాలైన భౌతిక సుఖాలు లభిస్తాయి. రుచికరమైన ఆహారం, ఇంటిని చక్కగా అలంకరించుకోవడం, తోటల పెంపకం, లలితకళలు, సంగీతం, చిత్రలేఖనం వంటివి వీరి అభిమాన పనులు.

వీరికి తమ తల్లిదండ్రుల మీద విపరీతమైన అభిమానం ఉన్నప్పటికీ కొన్ని కారణాల దృష్ట్యా వారికి దూరంగా ఉంటారు. ప్రజలకోసం, ప్రజల ఆనందం కోసం ఎక్కువగా కష్టపడతారు.

6వ సంఖ్యగలవారు ఒకేసారి అనేకమైన పనులు చెయ్యడంలో సిద్ధహస్తులు. ఇతర గ్రహ శుభదృష్టులు సరిగా ఉన్నట్లయితే వీరికి పూర్వీకుల ఆస్థి కలసి రావడమో, లాటరీ వంటి ఆకస్మిక ధనలాభమో కలుగుతుంది.

6వ సంఖ్య స్త్రీలు అందమైన ఫ్యాన్సీ డ్రస్సులు, పరిమళ ద్రవ్యాలు, సౌందర్య సాధనాలు బాగా ఇష్టపడతారు. నలుగురిలోనూ అందంగా కనబడడానికీ, కలివిడిగా తిరగడాన్ని ఇష్టపడతారు.

నలుగురిలో వీరిని పొగిడితే పొంగిపోతారు. తమ సమ్మోహన రూపంతో, వాక్చాతుర్యంతో, చలాకీతనంతో, కవ్వించే చూపులతో యిట్టే మగవారిని ఆకట్టుకుంటారు.

వీరి జాతక చక్రంలో శుక్రుడు శుభదృష్టి కలిగి ఉంటే ఇక వీరిని పట్టుకోవడం ఎవరి తరం కాదు.

ఫ్యాషన్ పోటీల్లో, అందాల పోటీల్లో, ఖరీదైన నగలు, సౌందర్య సాధనాల వాడకంలో ఇక వీరు కనిపించని చోటు ఉండదు. అందరినీ మంచివారిగా నమ్మే బోళాతనం వీరిది.

ఈ సౌందర్య పిపాస 6వ సంఖ్యవారికి ముసలితనంలో కూడా సజీవంగా ఉంటుంది. ప్రపంచమంతా ప్రేమ, సంతోషంతోనే తయారయ్యిందని వీరి అభిప్రాయం. జరిగిపోయిన సంఘటనలను పదే పదే తలచుకుంటూ బాధపడటం వీరి బలహీనతల్లో  ఒకటి.

వీరికి ఎదుటివారిని ప్రేమించడం, ఎదుటివారిని అర్థం చేసుకోవడమనే లక్షణం అధికంగా ఉంటుంది. వీరికి జ్ఞాపకశక్తి అధికం. సంఘంలో మంచి పేరు, ప్రఖ్యాతుల కోసం నిరంతరం పాకులాడుతుంటారు.

వీరికి ప్రశాంత జీవితం పట్ల ఎక్కువ ఇష్టం ఉన్నప్పటికీ, ఎవరూ లేనిదే ఉండలేని పరిస్థితనే చెప్పాలి. వీరు ఎదుటివారి ఎత్తులు కనిపెట్టి పై ఎత్తులు వేయడంలో సిద్ధహస్తులు.

వీరికి మధురమైన పదార్థాలపై ఎక్కువ ఇష్టం. వీరికి మొహమాటం ఎక్కువ కావడం వల్ల కొన్ని సమస్యలను తెచ్చుకుంటారు. వీరి సలహాలను అనుసరించిన వారు ఖచ్చితంగా విజయం సాధిస్తారనే చెప్పాలి.





వీరు ఎదుటి వారిని గమనించడంలో చాలా ఏకాగ్రత చూపిస్తారు. కోపం వచ్చినా ఎక్కువసేపు ఉండదు. తమాయించుకుంటారు. అంతేగాని ఆ కోపాన్ని కడుపులో ఉంచుకుని మిత్రులకూ, శత్రువులకూ అన్యాయం చేయరు.

వీరు 35 సంవత్సరాలకు జీవితంలో స్థిరపడిపోతారు. 45 సంవత్సరాలు వచ్చేసరికి అత్యంత బాధ్యతాయుతమైన పదవులో ఉంటారు.

వీరికి సాధారణంగా ఊపిరితిత్తుల యందు, హృదయ కోశం నందు అనారోగ్యము కలుగుచుండును. ముక్కుకు సంబంధించిన అనారోగ్యం కూడా తరచుగా కలుగుతుంటుంది. కాని చూడటానికి బలంగానే ఉంటారు.

వీరికి మే, అక్టోబరు, నవంబరు మాసములు అనుకూలంగా ఉండవు. ఈ మాసాలు అశుభకరంగా ఉంటుంది. ఈ మాసాలలో వీరు జాగ్రత్తగా ఉండటం ఎంతయినా అవసరం.

## వివాహ జీవితం - ఆర్థిక పరిస్థితులు

వీరి దాంపత్య జీవితం చాలా ఆనందంగా ఉంటుంది. వీరికి భార్య కూడా మంచి యోగ్యవంతురాలిగా లభిస్తుంది.

ఈ 6వ సంఖ్యగలవారు ప్రేమ విషయంలో విజయం పొందుతారు. వీరికి ఎదుటివారు కొంత ఆకర్షణీయంగా కనిపిస్తే చాలు, వీరిలో చాలా మార్పు కనిపిస్తుంది. వీరికి వివాహం త్వరగా గానీ, లేక మధ్య వయస్సులో గానీ జరిగే అవకాశం ఉంది.

వీరు 1,2,6 సంఖ్యగలవారిని వివాహం చేసుకోవడం శుభకరం. వీరిని చేసుకుంటే చాలా శుభప్రదంగా వివాహ జీవితం ఉంటుంది. వీరు 3వ సంఖ్యగలవారిని వివాహం చేసుకుంటే అధికంగా సమస్యలు, చికాకులు ఎదుర్కోవలసి వస్తుంది.

వీరి ఆర్థిక పరిస్థితి చాలా సంతృప్తిగా ఉన్నా, విందులు వినోదాల కోసం, వస్తువుల కొనుగోలు కోసం అధికంగా ధనం ఖర్చు చేస్తారు. వీరికి వ్యాపారంలో మంచి అభివృద్ధికి ఆస్కారముంది. వివాహం తరువాత వీరి వ్యాపారం ఇంకా బాగా ఉంటుంది.

వీరికి జీవితంలో ఎక్కువగా వస్తు, వాహన, గృహాలు బాగా ఏర్పడతాయి. వీరు కొంత ధనం ఖర్చు చేసినప్పటికి, దానికి తగిన ధనం బాగా సంపాదిస్తారు.

ఆరోగ్యపరంగా వీరు చాలా జాగ్రత్తగా ఉండాలి. వీరికి నరాలకు సంబంధించిన చికాకులు అధికంగా కలిగే ఆస్కారం ఉంది.

వీరికి ఆగ్నేయం, తూర్పు ముఖం గల ఇల్లు, వ్యాపార సంస్థల కలిసి వస్తాయి. వీరికి తెలుపు, నీలం, గులాబి, ఎరుపు రంగులు కలిగిన దుస్తులు ధరిస్తే శుభం కలుగుతుంది.

వీరికి మంగళవారం, గురువారం, శుక్రవారాలు బాగా అనుకూలమైన వారాలు. వీరు వజ్రనీలం, వజ్రం, నీలం జాగర్ ధరిస్తే అభివృద్ధి కలుగుతుంది.

వీరి అదృష్ట సంఖ్య 6. 6,9,18,24,27 తేదీలు శుక్రవారంతో వస్తే, ఉద్యోగ, వ్యాపారంలో జయప్రదంగానే ఉంటుంది. వీరు ఎక్కువగా బంగారు ఆభరణాలు ధరించినా శుభం కలుగుతుంది.

6వ సంఖ్యగలవారికి ఏప్రిల్ 20 నుండి మే 27 వరకు, సెప్టెంబరు 21 నుండి అక్టోబరు 27 వరకు గల మధ్యకాలంలో 3,6,9,12,15,18, 21,24,27,30 తేదీలు చాలా అనుకూలంగా ఉంటాయి.

వీరికి నీలం చాలా శుభకరమైన రంగు. నీలంలో ముదురురంగు, లేత రంగు కూడా వాడుకోవచ్చు. కానీ నలుపు రంగు గానీ, ఇతర ముదురు రంగులు అంత మంచివి కావు.

వీరికి గోమేధికం అనే రాయి శుభకరమైంది. ఉంగరం మొదలగు ఆభరణాల యందు గోమేధికం ధరించడం చాలా మంచిది.

6వ సంఖ్యగలవారికి నవరత్నాల్లో ఒకటైన ప్రవాళ రత్నమును కూడా వాడుకోవచ్చు.

వీరు లలితా సహస్రము, మహాలక్ష్మి పూజలు చేస్తే శుభం కలుగుతుంది.

## ఏడవ సంఖ్య

ఈ 7వ సంఖ్యకు కేతువు అధిపతి. అశ్వని, మఖ, మూలా నక్షత్రాలకు కేతువు అధిపతి అవడం వల్ల ఈ నక్షత్రములలోని వారు కూడా ఈ సంఖ్యకు చెందినవారవుతారు.

ఏ సంవత్సరమైనను, ఏ మాసమైనను 7,16,25తేదీలలో జన్మించినవారు 7వ సంఖ్యకు చెందిన వారవుతారు.

7వ సంఖ్యకు చాలా ప్రాముఖ్యత ఉంది. సప్త ఋషులు, సప్త స్వరములు, సప్త సముద్రాలు 7వ సంఖ్యను సూచిస్తున్నాయి.

కొంతమంది చంద్రుడు 7వ సంఖ్యకు కూడా అధిపతి అని అంటుంటారు. ఎందుకంటే కేతువు ఛాయగ్రహం అవడం వల్ల, ఈ సంఖ్యకు చంద్రునికి సంబంధం ఉందని అంటారు.





ఈ 7వ సంఖ్యలో జన్మించినవారు మంచి ఎత్తుతో, ఆకర్షణీయమైన కళ్ళతో, అందమైన ఆకృతితో అందరినీ ఆకర్షిస్తుంటారు.

చక్కని శరీర ఛాయగల వీరి మాట తీరు, ఎదుటివారిని శాసిస్తున్నట్లుగా ఉంటుంది. అయితే 7వ సంఖ్యగలవారు చంచల మనస్కులు. చిన్నవైన చెవులతో, దళసరి తలవెంట్రుకలతో అందరికీ ఇష్టులుగా ఉంటారు.

7వ సంఖ్యగలవారు స్వేచ్ఛా జీవితాన్ని కోరుకుంటారు. వీరు అన్ని విషయాలలోను వ్యక్తిగతంగానూ, స్వతంత్ర్యంగానూ వ్యవహరించడంలో సమర్థులుగా ఉంటారు. వీరు ఎప్పుడూ సరదాగా తిరిగే కోరిక గలవారై ఉంటారు.

కానీ కాలాన్ని వృథా చేయకుండా ఎప్పుడూ ఏదో ఒక పనిచేస్తూ ఉంటారు. వీరు ఎక్కువగా విదేశాలలో తిరుగుతుంటారు. ఎక్కువగా చదువుకుని ప్రపంచజ్ఞానాన్ని ఎక్కువగా పొందినవారుంటారు.

వీరు సునిశితమైన ఆలోచనా జ్ఞానం కలవారు. తర్కం, అంతర్గత జ్ఞానం ఎక్కువగా గలవారు. సుప్రసిద్ధులైన మేధావులు, సంస్కర్తలు, శాస్త్రవేత్తలు, కవులు, రచయితలు గ్రంథకర్తలు 7వ సంఖ్యకు చెందినవారై ఉంటారు.

వీరు చక్కని ప్రతిభ గల వృత్తి నిపుణులు. ముఖ్యంగా వీరు విదేశీ వ్యవహారాలు, విదేశీ వాణిజ్యం, ట్రావెలింగ్ రంగాల్లో బాగా రాణిస్తారు.

7వ సంఖ్యగలవారు మంత్ర తంత్రాది ప్రాచీన శక్తుల మీద సాధికారత, ఆసక్తి కలిగి ఉంటారు. వీరి జీవితంలోని సంఘటనలు లెక్కలేనన్ని మలుపులు తిరుగుతాయి. విశాల దృక్పథంతో వ్యవహరిస్తే – ప్రపంచ వ్యాప్తంగా తన పరిసరాల్లో జరిగే మార్పుల నుండి అధిక ప్రయోజనం పొందుతారు.

7వ సంఖ్యగలవారు స్వదేశంలో కన్నా విదేశాల్లో తమ ప్రతిభ పాటవాన్ని ఎక్కువగా వినియోగించి మంచి గుర్తింపుని పొందుతారు. విజ్ఞానం కోసం దేశవిదేశాలు తిరుగుతుంటారు.

వీరికి తాము చెప్పదలచుకున్న విషయాన్ని స్పష్టంగా చెప్పడం అలవాటు. మంచి విజ్ఞానవంతులు. భావి జీవితంలో స్థూలకాయులుగా మారవచ్చు. రాజకీయం, రచన, కళారంగాలలో విశిష్ట సేవ చేసినవారై ఉంటారు.

ఎవరినీ అంత తొందరగా నమ్మని వీరు, తరచుగా తమ అభిప్రాయాలను మార్చుకుంటుంటారు. గొప్ప గొప్ప ఆలోచనలతో మంచి మంచి ఆశయాలు గలవారై నిరంతర కృషితో ప్రఖ్యాతి పొందుతారు.

పొగడ్తలకు తొందరగా లొంగని వీరు తాము చేసిన పనులను ఇతరులు గుర్తిస్తే సంతోషపడతారు. వీరి భుజాలు కాస్త పొడవుగా ఉండడం వల్ల వీరిని చూడగానే 7వ సంఖ్యగలవారిగా గుర్తించవచ్చు.

ఏ పని చేయాలని తలపెట్టినా అధికంగా కష్టపడే వీరు, తాము చేపట్టిన పనిలో విజయాన్ని చవి చూస్తారనడంలో సందేహం లేదు. ఈ సంఖ్యగలవారికి బంధువుల మీద కంటే స్నేహితుల మీదే ఎక్కువ నమ్మకం.

7వ సంఖ్యగలవారి జీవితంలో ప్రతి విషయం సమంగానే ఉంటుంది. చిన్నప్పుడు కొంత కష్టపడటం, మరలా కాస్తంత సుఖం. వివాహానంతరం బాగున్నప్పటికీ కొంతమేర చికాకులు ఉంటుంటాయి. కుటుంబ జీవితంలో సుఖం సామాన్యంగా ఉంటుంది.

వీరి ఆలోచనలు క్రియారూపంలో పెట్టిన తర్వాత కాస్త ముందు వెనుకలుగా నెరవేరుతుంటాయి. కాబట్టి వీరికి అప్పుడప్పుడు నిరుత్సాహంగా అనిపిస్తుంటుంది. వీరు తమ బుద్ధికి ఏది మంచిది అనిపిస్తే ఆ మార్గాన్నే అనుసరిస్తారు.

వీరు దైవబల సంపన్నులగుటచే జ్యోతిషశాస్త్ర పరిచయం లేకపోయినా, ఆత్మబల సంపన్నులవడంతో భూతభవిష్యత్ వర్తమానాలకు సులభంగా చెబుతారు. భవిష్యత్తు నందు జరగబోయే ముఖ్య విషయాలు వీరికి కలల రూపంలో కూడా ముందుగానే కనబడుతుంటాయి.

7వ సంఖ్యగలవారికి ఆదివారం, సోమవారం చాలా అనుకూలమైన వారములు. సంఖ్యాశాస్త్ర రీత్యా వీరికి 1,2,4,10,11,13,19, 20,22,28,29,31 తేదీలు కూడా చాలా అనుకూలంగా ఉంటాయి.

7వ సంఖ్యగలవారికి మార్చి, మే, జూన్, ఆగస్టు, సెప్టెంబరు, డిశెంబరు మాసాలు సామాన్యంగా ఉంటాయి. వీరికి 7,16,25,34,43,52,61 సంవత్సరములు విశేష యోగవంతంగా ఉంటుంది.

7వ సంఖ్య గలవారు అపకారికి ఉపకారం చేసే లక్షణం గలవారై ఉంటారు. వీరు ఇచ్చే సలహాలు, సూచనలు శత్రువులకు కూడా చాలా ప్రయోజనకరంగా ఉంటుంటాయి.

7వ సంఖ్యగలవారు జాతక చక్రంలో బుధుడు శుభదృష్టితో చూస్తూ లాభించే చోట ఉన్నట్లయితే అతి సూక్ష్మమైన పరిశీలనా జ్ఞానం కలుగుతుంది. ఏకసంథా గ్రహిత్వంతో అనేక రకాల వృత్తుల్లో ప్రావీణ్యం ఉంటుంది.





వీరికి జ్ఞాపకశక్తి బాగా ఉంటుంది. వారి ప్రతిభాసామర్థ్యాలను ఇతరులనామ మాత్రపు సహాయంతో అభివృద్ధి పరచుకోగలరు.

7వ సంఖ్యగలవారు పరిశోదన, సాహిత్య రంగాలలో రాణిస్తారు. పరిణతి చెందిన మనోబలంతో సరైన నిర్ణయాలు తీసుకుంటారు. ఈ లక్షణాలు వీరి జీవితాన్ని అభివృద్ధి దిశగా నడిపిస్తాయి.

## వివాహ జీవితం - ఆర్థిక పరిస్థితులు

7వ సంఖ్య గల వారి వివాహ జీవితం అంత సంతోషదాయకంగా ఉండబోదు. కానీ, తమ జీవితాన్ని శాంతియుతంగా మార్చుకునేందుకు వీరు అనేక రకాలైన ప్రయత్నాలను చేస్తుంటారు.

వీరికి తమ సహచరి పట్ల ప్రేమాభిమానాలు ఎక్కువగా ఉంటాయి. వృత్తి, ఉద్యోగాల పట్ల ఎక్కువ శ్రద్ధ చూపించే వీరు, కుటుంబ సభ్యులతో ఎక్కువ సమయం గడపలేక పోతుంటారు.

వీరికి ఆధ్యాత్మిక చింతన ఎక్కువగా ఉంటుంది. ఈ సంఖ్యావారికి ముభావం ఎక్కువ. అందువల్ల వీరికి ఇంటా – బయట ఇబ్బందులు, సమస్యలు తప్పవు.

7వ సంఖ్యగలవారు 2వ సంఖ్యగలవారిని వివాహం చేసుకుంటే సుఖసంతోషాలతో ఉండగలరు.

వీరు 8వ సంఖ్యగలవారిని వివాహం చేసుకుంటే, ఊహించని సమస్యలను ఎదుర్కోవలసి ఉంటుంది.

వీరి సంతానం మంచిస్థాయికి చేరుకున్నప్పటికీ సంతానం వల్ల సుఖసంతోషాలు ఉండవు. ఆర్థిక పరిస్థితి హెచ్చు తగ్గులుగా ఉంటుంది. అయితే ఆర్థికపరమైన చిక్కులు వీరికి ఉండవు.

వీరు 24 లేక 32 వ సంవత్సరం నుంచి అభివృద్ధి సాధిస్తారు. నెమ్మదిగా అభివృద్ధిని పొందే వీరు వ్యాపార, రాజకీయ రంగాలలో ప్రాముఖ్యత చెందుతారు.

వీరికి ప్రతి 7 సంవత్సరాలకి ఒకసారి కలసి వస్తుంటుంది. అంటే తమ 21,28,35,42,49 సంవత్సరాల వయస్సులో వీరి జీవితానికి సంబంధించిన ముఖ్యమైన మార్పులు, సంఘటనలు చోటు చేసుకుంటాయి.

వీరు దైనందిన సమస్యల మీద స్వతంత్ర్యంగా నిర్ణయాలు తీసుకోలేరు. ఎక్కువగా ఇంటి విషయాల్లో జీవిత సహచరి మీద ఆధారపడతారు. ప్రేమ వ్యవహారాల్లో తొందరపాటు మంచిది కాదు.

7వ సంఖ్యగలవారు జీవితంలో తొందరపడి తాత్కాలిక నిర్ణయాలు తీసుకోవడం అంత మంచిది కాదు. ఏది మాట్లాడవచ్చో, ఏది మాట్లాడ కూడదో వంటివి తెలుసుకుని మసలుకోవాలి.

వీరికి కళారంగంలో ఊహించని అభివృద్ధి ఉంటుంది. వీరు ఇతరులకు ఇచ్చిన సలహాలు, వారికి ఆర్థికంగా ఎంతో లాభాన్నిస్తాయి.

కానీ వీరి ఆలోచనలు వీరికి మాత్రం లాభకరంగా ఉండదన్నది నిజం. ఆరోగ్య విషయంలో ఈ సంఖ్యకు చెందినవారు ఎక్కువగా జాగ్రత్త తీసుకోవాల్సి ఉంటుంది.

7వ సంఖ్యగలవారికి చర్మ శ్వాసకోశ, ఉదర సంబంధమైన సమస్యలు తలెత్తే అవకాశముంది. అందుకే వీరు తమ ఆరోగ్యం విషయంలో చాలా జాగ్రత్తగా ఉండాలి.

వీరికి వాయువ్యం, ఉత్తర ముఖంగా ఉన్న ఇల్లు కలసివస్తుంది. వ్యాపార సంస్థలు కూడా ఇలా ఉంటే బాగుంటుంది. ఈ 7వ సంఖ్య గల వ్యక్తులు లేతరంగు దుస్తులు, లేత ఎరుపు, తెలుపు, ఆకుపచ్చ రంగుదుస్తులను ధరిస్తే శుభం కలుగుతుంది.

వీరు వైఢూర్యం, కృష్ణ వైఢూర్యం ధరిస్తే అభివృద్ధి బాగుంటుంది. వెండి లేక ప్లాటినం ఆభరణాలు ధరిస్తే లాభదాయకంగా ఉంటుంది.

స్వశక్తితో అభివృద్ధి చెందే వీరు బాగా డబ్బు సంపాదించినప్పటికీ, విపరీతమైన ఖర్చులు చేయడం వల్ల సమస్యలను ఎదుర్కొంటుంటారు. అధికమైన పట్టుదల గల వీరు మంచి పేరు ప్రఖ్యాతులు కలిగినప్పటికీ నిందలను కూడా మోస్తుంటారు.

వీరికి ఎక్కువగా ప్రజాకర్షణ ఉంటుంది. వీరికి సిక్త్‌సెన్స్ ఎక్కువ. ఫలితంగా భవిష్యత్తులో జరగబోయే పరిణామాలను తమ ఊహలద్వారా తెలుసుకోగలరు.

వీరు గణపతి పూజ, సుబ్రహ్మణ్యస్వామి పూజలు చేస్తే కలసి వస్తుంది.

## ఎనిమిదవ సంఖ్య

ఈ 8వ సంఖ్యకు శని అధిపతి. మన హిందూ ధర్మంలో ఈ సంఖ్యకు ప్రత్యేక స్థానం ఉంది. అష్టలక్ష్ములు, అష్ట ఐశ్వర్యాలు, అష్ట దిక్పాలకులు అంటూ ఎనిమిదికి ఎంతో ప్రాముఖ్యత ఉంది.

ఏ సంవత్సరంలోనైనా, ఏ మాసంలోనైనా 8,17,26 తేదీలలో జన్మించినవారు 8వ సంఖ్యకు చెందినవారవుతారు.





పుష్యం, అనూరాధ, ఉత్తరాభాద్ర నక్షత్రాలకు అధిపతి శని అవడం వల్ల ఈ నక్షత్రాలకు చెందినవారు కూడా 8వ సంఖ్యకు చెందినవారవుతారు.

సూర్యుని పుత్రుడైన శనిగ్రహం కూడా మిగతా గ్రహాల వలె గొప్పది. కానీ, చాలా మంది శనీశ్వరుని పేరు వింటేనే హడలిపోతుంటారు. మనం గొప్ప స్థాయికి రావాలన్నా, మంచిపేరు ప్రఖ్యాతులు సంపాదించాలన్నా శనీశ్వరుని దయ తప్పక కావాలి. అందుకే నవగ్రహాలలో శనికి ప్రత్యేకస్థానం ఉంది.

8వ సంఖ్యగలవారు కాస్త పొడవుగా, చామన ఛాయతో, నిటారైన ముక్కుతో, చూపుల ద్వారానే తమ అభిప్రాయాలను తెలియజేసేవారుగా ఉంటారు.

విశాలమైన భుజాలతో చిన్న నుదురు, చిన్న చిన్న చెవులతో కనబడే వీరికి, చిన్న వయస్సులోనే జుట్టు ఊడిపోయే ఆస్కారముంటుంది.

8వ సంఖ్య గలవారి జీవితం అందరి జీవితాల వలె కాకుండా మరొక విధంగా ఉంటుంది. అన్ని విషయాలలోనూ స్వశక్తి మీదనే ఆధారపడి ఉంటారు. ఇతరులను వీరు అంత తొందరగా నమ్మరు.

వీరి మనస్సు చాలా మెత్తన. అయినా పైకిచాలా కోపం గల వ్యక్తులుగా కనిపిస్తూ, సామాన్యంగా ఉంటారు. సాధారణంగా వీరు ప్రభుత్వానికి చెందిన ఉద్యోగం చేస్తూ ఉంటారు. కాని వీరి జీవితం కొంచెం కష్టాలతో నిండి ఉంటుంది.

వీరికి తంత్ర, మంత్ర శాస్త్రములంటే నమ్మకం ఎక్కువగా ఉంటుంది. వేదాంత విషయాలలో కూడా వీరికి అభిమానం ఎక్కువగానే ఉంటుంది.

8వ సంఖ్యగలవారు త్రికరణ శుద్ధిగా సహాయం చేసే గుణం గలవారు. ఇతరులకు తాము ఎంత గొప్ప సహాయం చేసినా ప్రతిఫలం ఆశించకుండా చేస్తారు.

అలాగే తాము పనిచేసే సంస్థకూ, సంఘానికీ కూడా స్వార్థరహితంగానే సేవలు చేస్తారు.

వీరు ఇతరుల పట్ల సహృద్భావం కలిగి ఉన్నా వీరిని తరచూ అందరూ అపార్థం చేసుకుంటారు. చేస్తున్న పనిపట్ల ఏకాగ్రత కలిగిన సునిశిత పరిశీలనాశక్తి వీరిది. ఎటువంటి కార్యాన్నయినా చాలా ఈజీగా సాధించి తీరుతారు.

8వ సంఖ్య అంతులేని శక్తికీ, సామర్థ్యానికీ ప్రతీక. దీన్ని సరైన మార్గంలో వినియోగించుకుంటే కష్టాలు, నష్టాలు తొలగిపోయి అద్భుతమైన విజయాల్ని చవిచూడగలరు. అయితే వీరు విజయం సాధించేవరకూ రాబోయే విజయాన్ని వచ్చినట్లుగా అంగీకరించే మనస్తత్వం కాదు.

8వ సంఖ్యగలవారు ప్రకృతి శక్తులలోని నిగూఢ రహస్యాలు సైతం గ్రహించగలుగుతారు. ఒకసారి భౌతికావసరాలలో సంతృప్తి చెందారంటే ఇకవారు గొప్ప తత్త్వవేత్తలుగా, ఆధ్యాత్మిక గురువులుగా, మతాచార్యులుగా వెలిగిపోతారు.

8వ సంఖ్యగలవారు తమ కాంక్షలను, ఆశయాలను అతి రహస్యంగా ఉంచుతారు. ఇటువంటి వారి వద్ద అపోహలకూ, ఊహాగానాలకూ తావుండబోదు. వీరు అంతా ప్రాక్టికల్‌గా ఆలోచిస్తుంటారు.

ఈ సంఖ్యవారు నీతి, నియమాలకు పెద్ద పీట వేసి, ప్రతి విషయాన్ని వివరంగా పరిశీలించిన తరువాతే ఒక నిర్ణయానికి వస్తుంటారు. వీరు చేసే పని ఖచ్చితంగా ఉండాలని చూస్తారు. అందుకే కొన్నిసార్లు అప్పగించిన పనులను ఆలస్యంగా పూర్తి చేసి చెడుపేరు తెచ్చుకుంటారు.

8వ సంఖ్యగలవారు స్వతహాగా నెమ్మదస్తులు. ఆశావహ దృక్పథాన్ని కలిగి ఉంటారు. ఈ స్వభావం వల్ల వీరికి కొంతమేలు జరుగుతుంది. పెద్దలన్నా, దేవుడన్నా ఎక్కువ భక్తి భావాన్ని కనబరిచే వీరి మాటలు సున్నితంగా ఉండి ఎదుటివారిని బాధపెట్టని విధంగా ఉంటాయి.

ఈ సంఖ్యగలవారికి ఆత్మవిశ్వాసం ఎక్కువ. ప్రశాంతతను కోరుకునే వీరు, ఏ పని చేపట్టినప్పటికీ ఆ పనిలో విజయాన్ని సాధిస్తారు. వీరు కనుక సైన్యంలో చేరినట్లయితే ఘనకార్యాలు చేయగలుగుతారు.

8వ సంఖ్యగలవారు ఇతర సంఖ్యల వారికన్నా ప్రణాళికాబద్ధంగా జీవిస్తారు. రాజకీయ రంగం వీరికి ఎంతో అనుకూలమైంది. 1,3,6 సంఖ్యలతో సంబంధం గలవారు అత్యున్నత పదవులు అధిరోహించ గల్గుతారు.

ఇతర సంఖ్యల వారికన్నా 8వ సంఖ్య గల వారి జీవితంలో సంఘటనలు చిత్ర విచిత్రంగా మారిపోతుంటాయి. అల్పాయుష్షు గలవారు సైతం పదికాలాల పాటు అందరికీ గుర్తుండిపోతారు. దీనికి కారణం వీరు చేసిన మంచి పనులే.

మొత్తంమ్మీద ఈ 8వ సంఖ్యగలవారి జీవితము నిర్ణయించాలంటే కొంచెం కష్టసాధ్యంగానే ఉంటుంది.





వీరు సాధారణంగా వేదాంతులుగాను, జ్యోతిష్యం చెప్పి జీవించేవారిగా, పరిశ్రమలలో ఆరితేరిన వారిగా, వ్యవసాయదారులుగా ఉంటారు.

వీరు తమ సంతోషం కన్నా తమకు ఆశ్రయించుకొని వున్న వారి సంతోషం గురించే ఆలోచిస్తుంటారు. ఇది అదృష్ట సంఖ్య అని చెప్పడానికి వీలులేదు. అనేక కష్టనష్టాలు దాటిన తర్వాతగాని అదృష్టం లభించదు.

8వ సంఖ్యగలవారి జీవితం ఒంటరిగానే గడచిపోతుంది. వీరి హృదయం మంచిదైనను పైకి మాత్రం కఠిన హృదయం గలవారిగా కనిపిస్తారు. వీరి జీవితం సామాన్యంగా గడచి పోతుందని చెప్పవచ్చు.

వీరికి సేవక వృత్తి ఎక్కువ. అంటే ఒకచోట ఉద్యోగానికి కుదిరితే అక్కడే అతుక్కుని ఉంటారన్నమాట. అంత త్వరగా ఈ 8వ సంఖ్యగలవారు మార్పులను కోరుకోరు. వీరికి జ్ఞాపకశక్తి ఎక్కువగా ఉంటుంది.

వీరు ఒక విషయాన్ని పరిశీలించి ఖచ్చితమైన అభిప్రాయాల్ని చెప్పడంలో చాలా ఘటికులు. వీరికి ఎదుటివారి అభిప్రాయాలను గ్రహించే గుణం ఎక్కువ. బయటి విషయాలకు ఎక్కువ ప్రాముఖ్యత ఇచ్చే వీరు. ఇంటి విషయాలను అంతగా పట్టించుకోరు.

పొగడ్తలకు తేలిగ్గా లొంగిపోయే వీరు స్నేహ స్వభావంతో, మంచితనంతో అందరికీ ఆప్తులుగా మెలుగుతారు. ఏ పని చేపట్టినా, తమ స్వంత పనిలా కష్టించే వీరికి, పనిలోకి దిగినప్పట్నుంచి నిద్రాహారాలు కూడా గుర్తుకు రావు.

చదువులో అంత శ్రద్ధ చూపని వీరికి ఇతరులకు సాయం చేయడమంటే అమితమైన, అపారమైన ఇష్టం.

ప్రకృతి అన్నా, ప్రయాణాలన్నా, పుణ్యతీర్థాలన్నా సర్వాన్ని మరచిపోయే ఈ 8వ సంఖ్యవారికి శుభ్రత పట్ల శ్రద్ధ ఎక్కువే. వీరి ఇల్లు పరిశుభ్రంగా మిలమిలలాడు తుంటుంది.

అలాగే స్నేహానికి ఎక్కువ ప్రాముఖ్యత నిచ్చే వీరు స్నేహం కోసం ఎంతటి త్యాగం చేయడానికైనా సిద్ధపడుతుంటారు. ఒకరి నుంచి సాయం పొందిన విషయాన్ని ఎప్పటికీ మరచిపోలేని వీరికి, నడివయసు తరువాత మంచి అభివృద్ధి కనబడుతుంది. వీరు ఎప్పుడూ చిరునవ్వుతో కనిపిస్తారు.

## వివాహ జీవితం - ఆర్థిక పరిస్థితులు

ఈ 8వ సంఖ్యవారి వివాహజీవితం సుఖప్రదంగానే సాగిపోతుంది. ప్రేమ వ్యవహారాలు వీరికి అంతగా అనుకూలించవు.

8వ సంఖ్యగలవారు 1వ సంఖ్యకు చెందినవారిని వివాహం చేసుకోవడం శుభప్రదం. వీరికి మంచిసంతానం కలుగుతుంది.

వీరు వివాహ విషయంలో ఎంతో జాగ్రత్త వహించాలి. 1,3,6 సంఖ్యలకు చెందిన వ్యక్తులను వివాహమాడి కుటుంబంపై కాస్త శ్రద్ధ చూపగల్గితే భగవంతుడు వీరికి ఎనలేని సుఖసంతోషాలనూ, అభివృద్ధినీ కలిగిస్తాడు.

వీరు తమ గౌరవాన్ని అక్రమ లైంగిక సంబంధాల వల్ల పోగొట్టుకుంటారు. వీరు పేరు కోసం, గొప్ప కోసం వివాహం చేసుకుంటారు. కానీ వివాహ జీవితం పట్ల సంతృప్తి ఉండదు. 8వ సంఖ్యగల స్త్రీలు భర్తతో సర్దుకుపోలేక విడిపోతారు.

8వ సంఖ్యగలవారికి స్త్రీ సంతానం ఉంటుంది. ఆడపిల్లలే వీరి అభివృద్ధికీ, సుఖసంతోషాలకూ ఆలంబన. ఈ జాతకునకు పిల్లలు లేకపోతే ఒక ఆడపిల్లను దత్తత తీసుకోవడం మంచిది. అదీ సాధ్యం కాకపోతే పనిపిల్లనైనా ఇంట్లో ఉంచుకోవాలి.

వీరి ఆర్థిక పరిస్థితి బాగానే ఉంటుంది. 30-33 సంవత్సరాలు తర్వాత మంచి అభివృద్ధి కనబడుతుంది.

ఆభరణాలపై మక్కువ అధికం. నూనె, ఇనుము, సినిమా రంగాలు వీరికి బాగా కలసి వస్తాయి.

ఉద్యోగాలలో ఉన్నవారికి అభివృద్ధి నెమ్మదిగా ఉంటుంది. ఈ సంఖ్య గలవారికి సంతానం కలిగిన తర్వాత మరింతగా కలసి వస్తుంది. కీళ్ళ నొప్పులు, జీర్ణకోశ వ్యాదులు నోటికి సంబంధించిన వ్యాధులతో అప్పుడప్పుడు అవస్థలు పడే వీరు ఆరోగ్యం పట్ల జాగ్రత్తగా ఉండటం మంచిది.

వీరికి పడమర ముఖం గల ఇల్లు, షాపు, వ్యాపార సంస్థలు కలసివస్తాయి. ఈ సంఖ్య గలవారు నీలం, బూడిద రంగు దుస్తులను ధరిస్తే శుభం కలుగుతుంది.

వీరి అదృష్ట సంఖ్య 8. అదృష్ట రత్నం నీలం.

1,10,17,26,28 తేదీలలో శనివారం కలిసి వస్తే ఆ రోజులలో వీరు చేపట్టిన పనులు నిర్విఘ్నంగా నెరవేరుతాయి.

ఈ సంఖ్యగలవారు ఎక్కువగా వెండి ఆభరణాలు ధరిస్తే మంచిది. ఆదివారం, సోమవారం, శనివారం కలసివస్తాయి.

వీరు ఈశ్వరుని పూజించి, ఆరాధిస్తే మంచి ఫలితాలు కలుగుతాయి.





## తొమ్మిదవ సంఖ్య

ఈ 9వ సంఖ్యకు కుజుడు అధిపతి. నవగ్రహాలలో కుజునికి ప్రత్యేకస్థానం ఉంది. నవరత్నాలు, నవగ్రహాలు, నవధాన్యాలు అనేవి ఈ సంఖ్య నుంచి ఆవిర్భవించినవి. జ్యోతిష్య శాస్త్రంలో ఈ 9వ స్థానానికి భాగ్యస్థానం అనిపేరు.

ఈ సంఖ్యకు అధిపతి కుజుడు అవడం వల్ల, ఈ సంఖ్యలో జన్మించిన వారు మంచి రంగు, ఎత్తు కలిగి, శారీరక పుష్టి కలిగిన వారుగా ఉంటారు.

ఈ సంఖ్యగలవారిని మనం తేలిగ్గా గుర్తుపట్టవచ్చు. వీరి కంఠస్వరము చాలా గంభీరంగా ఉంటుంది. వీరు నడవడిక గలవారు, ఆచి తూచి మాట్లాడే స్వభావం గలవారు, చూడటానికి ఆకర్షణీయమైన, తీక్షణమైన చూపుగలవారు, ఎదుటివారిని ఇట్టే ఆకట్టుకునే మాట, మంచితనం గలవారుగా ఉంటారు.

వీరి వైఖరి చూస్తే చాలా మొండివారుగా కనబడతారు. వీరికి ఆత్మ నిగ్రహం తక్కువ. జీవితంలో ఎటువంటి సమస్య అయినా తేలికగా ఎదుర్కునే స్వభావం గలిగినవారుగా, ఎదుటివారితో తేలికగా కలిసి మెలిసి సరదాగా ఉండే స్వభావం గలవారై ఉంటారు.

క్లిష్ట పరిస్థితులను అధిగమించి విజయం సాధించడం వీరి నైజం. జీవితంలో విశ్రాంతి అనేది ఎరుగరు వీరు. తమ శక్తి సామర్థ్యాలను ఒక క్రమపద్ధతిలో వినియోగించి ఆవేశాలను తగ్గించుకోవాలి వీరు.

భవిష్యత్‌లో వచ్చే అవసరాల కోసం ఇప్పుడే అంకురార్పణ చేస్తారు. వీరి ఆచరణాత్మక కార్యకలాపాలకు తగిన గుర్తింపు పొందుతారు. వీరు సాయుధ బలగాలు, పోలీస్, సైన్యం వంటి ఉద్యోగాలకు అతికినట్లు సరిపోతారు.

9వ సంఖ్యగలవారు తమ 27వ సంవత్సరంలో వీరు ఆర్థికంగా ఉద్యోగపరంగా స్థిరత్వాన్ని సాధిస్తారు.

తమ 35వ సంవత్సంలో ఉద్యోగంలో అత్యున్నత పదవికి చేరుకుంటారు. ప్రతి 9 సంవత్సరాలకు ఒకసారి వీరి జీవితంలో ముఖ్యసంఘటనలు చోటుచేసుకుంటాయి.

వీరు కుటుంబ పట్ల ప్రేమానురాగాలు కలిగి ఉంటారు. ఊరకే ఉద్రేకపడే స్వభావం గలవారై ఉంటారు. సహాయం కోరి వచ్చిన వారికి తప్పకుండా సహాయం చేస్తారు.

9వ సంఖ్యగలవారు దూరదృష్టితో దీర్ఘకాలిక ప్రణాళికలు వేసుకుని ఏళ్ళ తరబడి అవిశ్రాంతంగా శ్రమించి విజయం సాధిస్తారు. విదేశీ ప్రయాణాలు

వీరికి అనుకూలిస్తాయి. చిరకాలం జీవించినట్లయితే వీరు నాయకులుగా ఎదుగుతారు.

9వ సంఖ్యగలవారు సాహస స్వభావం కలవారు. ప్రతికూల పరిస్థితులకు ఎదురునిల్చి విజయం సాధించడం పట్ల ఆసక్తి కలవారు. వీరికి పరిస్థితులు కూడా అలాగే వస్తుంటాయి. ఈ సంఖ్య వారు ఇతరులు తమకు పూర్తిగా లొంగి ఉండాలని భావిస్తారు.

ఇక వీరు అభిమానించే వారి పట్ల వీరి ప్రవర్తన మొదట్లో ప్రళయంగా ఉంటుంది. వీరి డాంబికం ముందు ఇతరులు వెలవెలబోతారు. వీరితో వినోదం, విషాదం కూడా ఉధృతంగానే ఉంటుంది.

వీరికి గల గొప్ప లోటు ఇతరులను నీచంగా చూసే స్వభావం కలిగి ఉంటారు. మాటలలోను, పనులలో కూడా వెనుక ఆలోచించకుండా చాలా తొందరపడతారు. వీరికి శరీరం మీద గాయాలు తరచుగా తగులుతుంటాయి.

దయ, మంచితనం, చురుకుదనం, పని యందు ధ్యాస, ప్రతి విషయంలో ఏకాగ్రత, మంచి పట్టుదల, ఒక్కొక్కసారి అతి ప్రేమ, ఒక్కొక్కసారి ఊహించని చికాకుగా ఉంటుంటారు.

వీరికి వెనక ముందు ఆలోచించని స్వభావం ఉండడం వల్ల వీరికి అభిప్రాయ బేధాలు ఎక్కువగా వస్తాయి. ఏ విషయాన్నైనా అతి తేలికగా మరిచిపోవు లేక పట్టించుకునే స్వభావం గలవారై ఉంటారు.

ఉద్యోగంలో వీరికి త్వరితగతిన అభివృద్ధికి ఆస్కారం ఉంటుంది. అలాగే ఉద్యోగం పోగొట్టుకోవడంలో కూడా అలాగే ఉంటారు. వీరు ఎక్కువగా కృషిని నమ్మకం జరుగుతుంది వ్యాపార రంగాలలో మంచి అభివృద్ధికి ఆస్కారం ఉంటుంది.

వీరు ఎక్కువగా టెక్నికల్ రంగంలో రాణిస్తారు. వీరికి అపజయం తక్కువ. ఒక్కోసారి అపజయం పొందిన దానిని గురించి దిగులు చెందు స్వభావం ఉండదు.

వీరికి ఎవరి మీద ఆధారపడని స్వభావం ఉంటుంది. వీరికి ఖచ్చితంగా మాట్లాడే స్వభావం ఉన్నందున ఉద్యోగ, వ్యాపార రంగాలలో చికాకులు ఎదుర్కోవలసి వస్తుంది.

వీరు వాహనం నడిపేటపుడు అధికమైన వేగంలో పోతున్నప్పటికీ జాగ్రత్త వహిస్తారు.





వీరికి ఎదుటివారిని పరీక్షించడం అంటే ఎక్కువ ఇష్టమని చెప్పవచ్చు. వీరి మాట తీరు ఒక్కొక్కసారి చాలా కరకుగా ఉంటుంది. ఈ సంఖ్యలో జన్మించిన స్త్రీల మనోభావతీవాలు ఎవరికీ అర్థం కాకపోవడం విశేషం.

వీరికి మంగళవారం, గురువారం, శుక్రవారం చాలా అనుకూలమైన వారాలు. విశేషించి ఈ 9వ సంఖ్యకు కుజుడు అధిపతి అవడంతో మంగళవారం విశేష శుభఫలప్రదంగా ఉంటుంది.

9వ సంఖ్యకు 3,6 సంఖ్యలు అనుకూలమైనవి. అందుకే మొత్తం కలపగా 3,6 వచ్చు తేదీలు కూడా శుభఫలములు నిచ్చునవి గానే యుండును. అనగా 12,15,21,24,30 తేదీలలో వీరికి తప్పకుండా శుభఫలితాలు కలుగుతాయి.

ఈ 9వ సంఖ్యగల వారు విశేష ధనవంతులుగాను, జీవితమందు సర్వభోగములు అనుభవించు వారుగాను, మంచి ప్రవర్తన గలవారుగాను, కీర్తిని ఆర్జించువారుగాను బంధుమిత్రులను ఆదరించువారుగాను ఉంటారు.

## వివాహజీవితం - ఆర్థిక పరిస్థితులు

9వ సంఖ్యలో జన్మించిన వారిని ప్రేమించిన జయం పొందగలరు. కానీ వీరికి స్వంతంగా ప్రేమ వ్యవహారాలు అనుకూలించవు. వీరి నిర్ణయం వలన ఊహించని చికాకులు ఏర్పడతాయి. వీరికి కుటుంబ సౌఖ్యం చాలా తక్కువ.

9వ సంఖ్యగలవారు 3,5,6 సంఖ్యలవారిని వివాహం చేసుకుంటే శుభం కలుగుతుంది. వీరి ఆర్థిక పరిస్థితులలో హెచ్చుతగ్గులు ఉండగలవు. అయితే కావలసిన ధనం సకాలంలో కాకుండా కొంత ముందు వెనుకలుగా అందుతుంది.

ఈ సంఖ్య స్త్రీలు చక్కని గృహిణులుగా రాణిస్తారు. ఒకరకమైన స్నేహపూర్వకమై కాంతి వీరి కన్నుల్లో ప్రతిఫలిస్తుంది. ఇక వీరు తమకు అనుకూలమైన ఎరుపు రంగు వాడితే, తప్పక ఇతరుల ఆకర్షణకు గురవుతారు.

4,5,8 వంటి సారూప్యత లేని సంఖ్యల వారితో సంబంధ బాంధవ్యాలు వీరికి జీవితంలో ఇబ్బందులకు గురిచేస్తాయి. 3,6,9 వంటి సారూప్యత గల సంఖ్యలు వీరి జీవితంలో సుఖసంతోషాలను, అదృష్టాన్నీ ఇస్తాయి.

9వ సంఖ్య స్త్రీలు చక్కని అవయవ సౌష్టవంతో సౌందర్యవంతులనిపించు కుంటారు. వీరు హుందాగా, మర్యాదగా ప్రవర్తిస్తారు.

వీరికి అతిగా ధనం ఖర్చు చేయు స్వభావం ఉంటుంది. అందువలన వీరు కొంత ఆర్థిక సమస్యలకు అప్పుడప్పుడు గురవుతుంటారు.

వీరి ఆరోగ్య విషయంలో అంత చెడుగా ఉండదు. అయితే మధ్యవయసు నుంచి నరముల బలహీనత, బ్లడ్ ప్రెషర్ అధికంగా వస్తాయి. వీరి ఆరోగ్య విషయంలో అధిక జాగ్రత్త చాలా అవసరం.

వీరికి మిషనరీ, లారీలు, ఫ్యాక్టరీలకు సంబంధించిన వ్యాపారంలో కూడా మంచి అభివృద్ధికి ఆస్కారం ఉంటుంది.

వీరు వైద్యవృత్తిలో ప్రఖ్యాతి చెందుతారు. వీరికి అగ్నితో లేక కరెంట్‌కు సంబంధించిన వాటితో అతి జాగ్రత్త అవసరం.

వీరి సలహా, సహకారం పొందిన ఎదుటివారికి మంచి అభివృద్ధి ఉంటుంది. ఈ సంఖ్యలో జన్మించిన వారు ఎక్కువగా కాంట్రాక్టర్లుగా కూడా రాణించగలరు. వీరికి ఆలోచనా శక్తి ఎక్కువగా ఉంటుంది.

వీరికి శరీర, మానసిక విషయంలో జాగ్రత్త అవసరం. దక్షిణ ముఖం ఇల్లుగానీ, వ్యాపార సంస్థగానీ వీరికి శుభకరం.

మంగళవారం, గురువారం, శుక్రవారం వీరికి చాలా అనుకూలమైన వారాలు. ఎరుపు, నీలం రంగులు గల వస్త్రాలు ధరిస్తే శుభం కలుగుతుంది.

3,9,12,14,15,23,27,30 తేదీలు శుభకరమైన రోజులు. వీరు బంగారపు ఆభరణాలు ధరిస్తే చాలా మంచిది.

వీరు సుబ్రహ్మణ్యస్వామి, రామపూజ చేస్తే మంచిఫలితాలు కలుగుతాయి.

## జంట సంఖ్యల వల్ల ప్రయోజనాలు

అసలు జంట సంఖ్యలు ఏమిటి? జంట సంఖ్య అంటే మీ నామసంఖ్యగానీ, జన్మసంఖ్యలనూ కూడేటప్పుడు ఏర్పడే చిట్టచివరి రెండు అంకెల జతను జంటసంఖ్య అని అంటారు.

సంఖ్యాశాస్త్రంలో మీరేదైనా ప్రశ్న అడిగితే ఈ క్రింది విధంగా అనుసరించి వచ్చిన సంఖ్యను బట్టి ఫలితాన్ని చెప్పవచ్చు.

ప్రశ్న అడిగిన వ్యక్తి యొక్క జన్మసంఖ్య కనుగొనడం కోసం ఉదాహరణకు ఒకరు 17వ తేదీని జన్మించారనుకోండి 1+7=8.

ప్రశ్న అడిగిన తారీఖు ఉదాహరణకు ఒక నెలలో 22 తేదీన ప్రశ్నను అడిగారనుకుందాం. 2+2=4.

ప్రశ్న అడిగిన వ్యక్తిని 1 నుండి 100 లోపు తనకు నచ్చిన సంఖ్యను కోరుకోమనండి. ఉదాహరణకు అతను 66 అన్నాడనుకోండి. 6+6=12. 1+2=3.





ఇప్పుడు ప్రశ్న అడిగిన వ్యక్తి జన్మసంఖ్య, అతను ప్రశ్న అడిగిన తేది, నచ్చిన సంఖ్య అన్నీ కలిపితే 8+4+3=15.

ఈ వచ్చిన జంటసంఖ్య 15 యిచ్చే ఫలితాలను బట్టి ప్రవ్న అడిగిన వ్యక్తికి తగిన సలహాలను ఇవ్వవచ్చు.

ఇక 10 నుండి 52 లోపుగల జంటసంఖ్యలు ఎలాంటి ఫలితాలను యిస్తాయో ఎటువంటి గుణగణాలు కలిగిఉంటాయో చూద్దాం.

### జంటసంఖ్య 10

ఈ సంఖ్య గౌరవదాయకమైనది. విశ్వాసము, ఆత్మవిశ్వాసము, విషయ పరిజ్ఞానం కలుగుతుంది. స్త్రీలు ఇంటా, బయట ఆదరణ కలిగి ఉంటారు. ఇతరులను ఒప్పించగల నేర్పరితనం ఉంటుంది. నిజాయితీ, నిక్కచ్చిగా ఉండే మనస్తత్వం ఉంటుంది. ముందు కష్టాలను, తరువాత సుఖాలను కలుగజేస్తుంది.

### జంటసంఖ్య 11

వీరికి కుటుంబ వ్యవహారాల్లో అంతగా కలసిరాదు. చేసే పనులలో అనేక ఇబ్బందులు, ఇరకాటాలు ఉంటాయి. కానీ ఈ సంఖ్యకు చెందిన స్త్రీలు భర్తవైపు వారి కంటే పుట్టింటివారిపట్ల అభిమానం కలిగి ఉంటారు.

### జంటసంఖ్య 12

వీరు ఎప్పుడూ ఇతరుల గురించి ఆలోచిస్తూ ఎటువంటి త్యాగమయినా చేయడానికి వెనుకాడరు. ఇది మంచిది అని ఆ పనిలోకి దిగితే ఇకవారు వెనుదిరిగి చూడాల్సిన పని ఉండదు.

### జంటసంఖ్య 13

కొన్ని ప్రత్యేకతలు వీరిలో అధికంగా ఉంటాయి. ఇలాంటివారు మనసుపెట్టి పనిచేసారంటే విజయం వీరినే వరిస్తుంది. ఎక్కువ పని వలన నీరసం, మలబద్ధకం వంటి రోగాలనుండి జాగ్రత్త పడాలి.

### జంటసంఖ్య 14

తాత్కాలిక వ్యాపారాలు వీరికి అనుకూలంగా ఉంటాయి. కష్టనష్టాలు కూడా వీరికి వ్యాపారంలో ఒక భాగంగా ఉంటాయి.

### జంటసంఖ్య 15

కష్టాలు ఎదురైనప్పటికీ నలుగురు సహాయపడటం వల్ల ఎప్పుడూ సుఖసంతోషా లతో కాలం గడిచిపోతుంది. రుచికర భోజనం, ట్రావెలింగ్ అంటే ఎంతో ఇష్టం.

## జంటసంఖ్య 16

వీరికి జీవితం ఆనందంగా ఉండదు. భయం, విషాదం జీవితమంతా ఒడిదుడుకులతో ఉంటుంది. వ్యాపారంలో బాగా శ్రమించక తప్పదు. ముఖ్యంగా వీరు అపరిచితుల నుండి, విదేశీయుల నుండి లాభపడతారు.

## జంటసంఖ్య 17

భగవంతుని మీద నమ్మకంతో, ధైర్యంతో కుటుంబ బంధుమిత్రుల సలహాలను, పాటించడం ద్వారా అభివృద్ధిలోకి వస్తారు. స్త్రీల వ్యవహారాల్లో కట్టుబాటు అవసరం.

## జంటసంఖ్య 18

వీరు చాలా పేరుప్రఖ్యాతులు ఆర్జిస్తారు. వ్యాపార రంగంలో వీరికి బాగా కలిసి వస్తుంది. సాధారణంగా కష్టాలను ఆహ్వానించి, ఎదుర్కొని విజయం సాధిస్తారు.

## జంటసంఖ్య 19

వీరు సవాళ్ళను ఎదుర్కోగల అపారమైన అనుభవం కలిగి ఉంటారు. పిల్లలు జీవితంలో స్థిరపడడం కోసం అధిక శ్రద్ధ తీసుకుంటారు.

## జంటసంఖ్య 20

వీరు తమ వ్యక్తిగత సుఖాన్ని లెక్కచేయకుండా ఇతరుల కోసం శ్రమిస్తారు. భగవంతుడి మీద భక్తి వల్ల దివ్యజ్ఞాన విషయాలపై ఆసక్తి పెంచుకోవడమే కాకుండా ఇబ్బందులను కూడా అధిగమిస్తారు.

## జంటసంఖ్య 21

జీవితంలో ఎన్నో రకాలుగా అభివృద్ధిని సాధిస్తారు. ఆనందమయ జీవితం, అనుకూలవతియైన భార్య లభిస్తారు. ఒకటి కాదు ఇంకా అనేక రంగాలలో ప్రావీణ్యం, ఉంటుంది. కష్టాలు ఎదురైనా వాటిని సంతోషంగా అధిగమిస్తారు.

## జంటసంఖ్య 22

వ్యాపార విషయంలో ఈ సంఖ్య చక్కని లాభాలు కలుగజేస్తుంది. వివాహ విషయంలో 8,9 సంఖ్యలవారితో పనికిరాదు. ఒక ఉద్యోగంతో సంతృప్తి పొందక రెండు, మూడు వృత్తులతో ధనం సంపాదిస్తారు.

## జంటసంఖ్య 23

వీరికి డబ్బు విషయంలో ఏనాడూ లోటు ఉండదు. వ్యాపారంలో జీవిత భాగస్వామినే వాటాదారుగా చేసుకుంటే చక్కగా కలసి వస్తుంది. వీరి అభివృద్ధికి, విజయానికి స్త్రీయే కారణం. ఏ రంగంలోనైనా అభివృద్ధి సాధిస్తారు.





## జంటసంఖ్య 24

మంచి కళాదృష్టి, సౌందర్యారాధన కలిగి ఉంటారు. వీరికి జీవితంలో ఎటువంటి సమస్య ఎదురైనా స్నేహితులు, బంధువులు సాయం చేయడానికి సదా సిద్ధంగా ఉంటారు. భర్త తరపువారి వల్ల ఆదాయం కలసివస్తుంది.

## జంటసంఖ్య 25

జీవిత ప్రథమార్థంలో ఒడిదుడుకులు, ఆందోళన ఉన్నా, తర్వాత తర్వాత స్థిరత్వం కలుగుతుంది. వీరికి చిన్న వయసులోనే వివాహం అవుతుంది. ధన సంపాదనలో వీరిది విలక్షణమైన శైలి. జీవితం తరచుగా మార్పులకు లోనవుతుంది.

## జంటసంఖ్య 26

ఆస్థుల విషయంలోనూ, ఆదాయ పరంగానూ అభివృద్ధి ఉన్నా కుటుంబ విషయాల్లో అసంతృప్తి ఉంటుంది. అవకాశాల కోసం ఎప్పుడూ ఎదురుచూడడం మంచిది. 1,3,6 సంఖ్యల వారిని వివాహం చేసుకోవడం ద్వారా లాభాన్ని పొందుతారు.

## జంటసంఖ్య 27

వ్యాపారపరంగా, కుటుంబ వ్యవహారాల్లో సాధారణంగా వీరు ముందుచూపులో ఉంటారు. ఇతరుల సలహాలు, సంప్రదింపులు అవసరమైన తీసుకున్నా అంతిమ నిర్ణయం వీరే తీసుకుంటారు. కుటుంబాన్ని ఎంతగానో ప్రేమిస్తారు.

## జంటసంఖ్య 28

వివాహ విషయంలో పెద్దల సలహా తప్పనిసరిగా తీసుకోవాలి. లేకుంటే చాలా అసంతృప్తికి లోనయ్యే పరిస్థితి వస్తుంది. స్త్రీలకు సాఫీగా జీవితం గడిచిపోతుంది. మగవారు దైవభక్తితో, అధిక శ్రమతో అభివృద్ధిని సాధిస్తారు.

## జంటసంఖ్య 29

వీరు సున్నిత మనస్కులు. ఇతరులు వీరిని సరిగా అర్థం చేసుకుంటే వీరు ఎంతో మంచివారుగా కనిపిస్తారు. వ్యక్తిగత జీవితంలో సమస్యలు ఎదురయినా వృత్తి, ఉద్యోగాలలో అభివృద్ధిని సాధిస్తారు.

## జంటసంఖ్య 30

వీరి జాతకమంతా వీరి మానసిక ప్రవృత్తి మీద ఆధారపడి ఉంటుంది. ఎప్పుడూ స్నేహభావంతో ఇతరులకు సహాయం చేయడానికి సిద్ధంగా ఉంటారు.

స్త్రీలు ఏదైనా సాధించే నైపుణ్యం కలిగి ఉంటారు. చక్కని మాట తీరుతో అందరినీ ఆకట్టుకుంటారు. సిగ్గుతో, బిడియంతో ఉండకుండా ధైర్యంగా మాట్లాడే తత్వం వీరిది.

**జంటసంఖ్య 31**

వీరు కొన్ని ప్రత్యేకమైన నైపుణ్యాలు, సామర్థ్యం కలిగి ఉంటారు. 1,3,6 సంఖ్యల వారితో వ్యాపారం, రాజకీయ సంబంధాలు అభివృద్ధిని కలిగిస్తాయి. తొలుత మనస్థాపానికీ, అసంతృప్తికీ గురయినా వీరు తమ లక్ష్యాన్ని చేరుకుని విజయం సాధిస్తారు.

**జంటసంఖ్య 32**

వీరు స్వయంగా తీసుకునే ఏ నిర్ణయమైనా సమంజసంగానే ఉంటుంది. రహస్య విషయాలు, అంతు చిక్కని సందిగ్ధ విషయాలను పరిశోధించడం వీరి అలవాటు లౌక్యంగా హుందాగా ప్రవర్తించడం వీరి నైజం. వీరి హృదయంలో ఎంత ప్రేమ ఉన్నా కర్తవ్య నిర్వహణలో చాలా నిష్కర్షగా, కటువుగా వుంటారు.

**జంటసంఖ్య 33**

అతి సామాన్యంగా ఉండే కుంటుంబం నుండి వచ్చినా, ప్రముఖ వ్యక్తులుగా అపార గౌరవాన్ని అందుకుంటారు. జీవితం చివరి దశలో కూడా ఉల్లాసంగా, ఉత్సాహంగా పనిచేస్తారు. వీరి దాంపత్య జీవితం ఆనందంగా గడుస్తుంది.

**జంటసంఖ్య 34**

నెమ్మదిగా, స్థిరమైన పురోగతి కలుగుతుంది. వీరు ఊహించని పరిమాణాలు ఏర్పడి ఆకస్మిక ధనలాభం కలుగుతుంది. సంతృప్తికర దాంపత్య జీవితం వీరిది. చ్కని ఆధ్యాత్మిక, ధార్మిక వికాసం కలిగి ఉంటారు.

**జంటసంఖ్య 35**

కుటుంబ వ్యవహారాల్లో సున్నితంగా ప్రవర్తిస్తారు. వీరు తమ భావాలను పదిమంది ముందు బయట పెట్టి విమర్శలకు గురవుతారు. వీరికి భూ సంక్రమణల ద్వారా ఆస్తి, ధనం కలసి వస్తుంది. అలాగే విదేశీ యాత్రల వల్ల కూడా ధనం కలిసొస్తుంది.

**జంటసంఖ్య 36**

వీరు అధికంగా కష్టపడి అమితమైన బలంతో, గొప్ప శక్తి సామర్థ్యాలు కలిగి విజయాన్ని అందుకుంటారు.





క్రీడా సంబంధమైన వాటితో వీరికి విజయాలు అధికం. వ్యాపారంలో వీరి కృషి అమోఘంగా ఉంటుంది.

**జంటసంఖ్య 37**

జీవితంలో ప్రేమ, సృజనాత్మకత, మమతానురాగాలు గుండె నిండుగా ఉంటాయి. ఇతరులు రెచ్చగొట్టినప్పటికీ వీరు ఉదాసీనంగా వ్యవహరించడం చాలా మంచిది. ముఖ స్తుతికీ, పొగడ్తలకూ పొంగిపోకూడదు.

**జంటసంఖ్య 38**

వీరు ప్రశాంతంగా ఉండి, చక్కని ఆకర్షణశక్తి కలిగి ఉంటారు. తన మాటలతో అందరినీ ఆకట్టుకుంటారు. వ్యాపారంలో, భాగస్వాముల్లో సహనంతో ఉండటం చాలా మంచిది. దృఢ నిశ్చయంతో విజయాన్ని సాధిస్తారు.

**జంటసంఖ్య 39**

వీరికి గొప్ప తెలివితేటలు ఉంటాయి. తమ తెలివితేటలతో కష్టాలనీ, ఇబ్బందుల్ని ధైర్యంతో అధిగమించి విజయాన్ని అందుకుంటారు. కుటుంబ వ్యవహారంలో వచ్చే ఇబ్బందులు వీరిని బాధిస్తాయి. వాటిని అధిగమిస్తారు.

**జంటసంఖ్య 40**

వ్యాపారానికి సంబంధించి బాగా శ్రమిస్తే, చాలా కాలం నిరీక్షిస్తే తప్పకుండా విజయం కలుగుతుంది. ఈ సంఖ్యగల స్త్రీలు ఇతరుల మీద ఆధారపడకుండా తమ కాళ్ళ మీద తాము నిలబడే ప్రయత్నం చేస్తారు.

**జంటసంఖ్య 41**

సమస్యలు వచ్చినప్పుడు తొందరపడకుండా ఆ సమస్యకు తగిన నిర్ణయం, ఆలోచన చేస్తే శుభం కలుగుతుంది. వీరి ప్రయత్నాలు, వ్యాపారం, ఉద్యోగం ద్వారా కుటుంబ పరంగా వీరు తప్పకుండా విజయం పొందుతారు.

**జంటసంఖ్య 42**

ఎవరికీ హాని కలిగించని, ఎవరినీ నొప్పించని విధంగా వ్యాపారం చేసి ధనం సంపాదిస్తారు. కష్టకాలంలో ఆత్మీయుల సలహా తీసుకోవడం మంచిది. సంఘంలోని పెద్దస్థాయి వ్యక్తుల సహాయ, సహకారాలు వీరికి లభిస్తాయి.

**జంటసంఖ్య 43**

వ్యాపారంలోగాని, జీవితంలోగాని ఒడిదుడుకులు వీరికి ఉంటాయి. వివాహ విషయంలో ఏదోవిధమైన ఆటంకాలు ఎదురౌతాయి. కొత్త వ్యాపార ప్రయత్నాలు పూర్తిగా విరమించుకోవడం మంచిది.

### జంటసంఖ్య 44

వీరు తమ చిన్న వయసులోనే జీవితాన్ని బాగా ఎంజాయ్ చేస్తారు. స్నేహితురాళ్ళు సంఖ్య అధికంగా ఉంటుంది. సాధారణంగా వివాహేతర సంబంధాలు వీరికి ఎక్కువ. వ్యక్తిగత వ్యవహారాలలో వీరికి ఒక నిశ్చితాభిప్రాయం ఉంటుంది.

### జంటసంఖ్య 45

నిరంతర కార్యక్రమాలు, అపరిమితమైన శక్తిసామర్థ్యాలు, చొరవ, చైతన్యం వీరి సహజ లక్షణాలు. స్వంత నిర్ణయం మీద నిలబడితే వీరి ప్రణాళికలు విజయాలు వరిస్తాయి. ఏ పనిచేసినా దానిలో తప్పకుండా విజయం సాధిస్తారు.

### జంటసంఖ్య 46

స్వయం ఉపాధితో జీవితం గడిపేవారూ, దేశం కోసం, సంఘం కోసం పాటుపడే వారూ, సృజనాత్మకతతో పనులు చేసేవారు చక్కటి అభివృద్ధికి సాధిస్తారు. ప్రేమ వ్యవహారాలు, ముఖ్యంగా 4వ సంఖ్యగలవారిలో అనుకూలిస్తాయి.

## 1 నుండి 9 వరకు సంఖ్యల జీవిత విశేషాలు

ఈ సంఖ్యాశాస్త్రం అనంతమైంది. సంఖ్యాశాస్త్రమును మన జీవితానికి సంబంధించిన ప్రతి విషయానికి అనుసంధానం చేసుకుని అందులో వచ్చే మంచి చెడులను మనం తెలుసుకోవచ్చు.

ఒక సంవత్సరానికి 12 నెలలను 9 సమభాగాలుగా చేసి వాటి విశేషాలను మనం తెలుసుకోవచ్చు.

12 నెలలను 9 సమభాగాలుగా చేస్తే ఒక్కొక్క భాగానికి 40 రోజులు వస్తాయి. ప్రతి మనిషి యొక్క పుట్టిన తేదీ ఈ తొమ్మిది భాగాలలో ఏదో ఒక భాగంలో ఉంటుంది.

అందుకే ప్రతిమనిషి యొక్క జీవిత విశేషాలను ఈ భాగాన్ని బట్టి సులభంగా తెలుసుకోవచ్చు.

### 1వ సంఖ్య

ఈ ఒకటవ సంఖ్య వలనే మిగిలిన సంఖ్యలన్నీ పుట్టినవి. అందుకే ఈ ఒకటవ సంఖ్య సర్వ ప్రాణులకు మూలమైంది.

ఈ సంఖ్య స్వతంత్ర శక్తిని, అభివృద్ధిని సూచిస్తుంది. ఈ సంఖ్యకు జులై 21 నుండి ఆగష్టు 20 వరకు సింహరాశి.





మార్చి 21 నుండి ఏప్రిలు 29 వరకు మేషరాశిలో ఉంటారు. ఈ తేదీలలో వారు కొత్త విషయాలను కనిపెట్టుటలో ప్రత్యేక శ్రద్ధ చూపెడతారు. వీరు స్వంత ఆలోచన చేయుటలో, స్వశక్తితో వ్యవహరించేవారు గాను ఉంటారు.

తాము పట్టిన కుందేటికి మూడేకాళ్ళని వాదిస్తూ, తాము చేసే పనులను సాహసంతో పూర్తి చేస్తారు. ఈ తేదీలలో జన్మించిన వారందరూ ఇదే కోవకి చెందినవారుగా ఉంటారు.

వీరు చేపట్టిన వృత్తియందు ఉన్నత స్థానాన్ని పొందాలనే ప్రయత్నం చేస్తారు. ఆ విధంగా సంపాదించిన ఆధిపత్యాన్ని దుర్వినియోగం చేయకుండా ఆత్మగౌరవాన్ని కాపాడుకుంటారు. ఈ తేదీలలో ఏ పని ప్రారంభించినా అధిక లాభాలను పొందుతారు. వీరికి ఆదివారం, సోమవారం చాలా అనుకూలమైన రోజులు.

### 2వ సంఖ్య

ఈ సంఖ్యగలవారు శాంతస్వభావంగా ఉంటారు. అధిక ఆలోచనా శక్తి గల వారుగా, కవిత్వము, చిత్రలేఖనం మొదలైన కళల యందు విశేష అభిరుచి గలిగి, ఎప్పుడూ భోగాలను అనుభవిస్తుంటారు.

ఈ సంఖ్యగలవారు జూన్ 20 నుండి జులై 25 వరకు కర్కాటశ రాశి గలవారుగా ఉంటారు. వీరు శరీర బలం నందు అధిక బలసంపన్నులుగా ఉండక, కొంచెం బలహీనంగానే ఉంటారు.

ఈ తేదీలలో జన్మించిన వారు తమ ప్రయత్నాలను ఈ రోజులలోనే కార్యరూపంలో బెడితే తప్పక విజయం సాధిస్తారు. వీరికి ఈ రోజులలో విశేషజయప్రదంగానూ, లాభదాయకంగానూ, అనుకూలంగానూ, ఉత్సాహంగానూ ఉంటుంది.

ఈ సంఖ్యగల వారికి ఆదివారం, సోమవారం, శుక్రవారం మంచి ఫలితాలను అందిస్తూ అనుకూలంగా ఉంటుంది.

వీరు 7వ సంఖ్య గల వారితో కంటే 1వ సంఖ్యగల వారితోనే మంచి సంబంధాలు కలిగి ఉంటారు. ఎందుకంటే 7వ సంఖ్య గలవారి లక్షణాలు కంటే 1వ సంఖ్య గలవారి లక్షణాలు వీరికి సంతృప్తిగా ఉంటాయి.

### 3వ సంఖ్య

ఈ సంఖ్యగలవారు ఫిబ్రవరి 19 నుండి మార్చి 21 వరకు మీనరాశి యందు నవంబర్ 21 నుండి డిసెంబర్ 21 వరకు ధనస్సురాశి యందు ఉంటారు.

ఈ తేదీల మధ్య జన్మించినవారు ఆయాతేదీల మధ్యకాలంలో తమ పనులను క్రియారూపంలో పెడితే తప్పకుండా విజయం సాధిస్తారు. వీరికి ఈ తేదీలు మంచి అదృష్ట తేదీలని చెప్పవచ్చు.

ఈ సంఖ్య గలవారికి మంగళవారం, గురువారం, శుక్రవారం చాలా అనుకూలమైన రోజులు. వీరికి ఈ వారములలో 3వ తేదీ వస్తే ఆ రోజులలో అధిక ధనలాభంగానూ, ఆ రోజులలో చేపట్టిన పనులు దిగ్విజయంగా పూర్తవుతాయి.

ఏక సంఖ్యగా చేసినప్పుడు 6 గాని 9 గాని వచ్చు సంఖ్యలగు 6,9,15,18,24,27 సంఖ్యలు మంగళ, గురు, శుక్రవారాలతో కలసినప్పుడు అప్రయత్నంగానే ధనలాభాన్ని, వస్తు ప్రాప్తిని, విజయాన్ని కలుగచేస్తాయి.

**4వ సంఖ్య**

ఈ సంఖ్యగలవారు జూన్ 21 నుండి జులై 21 వరకు కర్కాటకరాశి నందు, జులై 22 నుండి ఆగష్టు 31 వరకు సింహరాశి యందు ఉంటారు.

ఈ 4వ సంఖ్యగలవారు ఈ తేదీల మధ్య ఏక సంఖ్య 2 గాని 8 గాని వచ్చే తేదీలలో జన్మించిన వారితో ఎక్కువగా స్నేహము చేస్తారు. వీరితో స్నేహం స్థిరంగా ఉంటుంది.

4, 8, 13, 17, 22, 26, 31 తేదీలుగాని, ఈ నెంబరు గల ఇల్లు గాని వీరికి అనుకూలంగా ఉండదు. కష్టాలను కలుగ చేస్తాయి. వీటి వల్ల లాభంగాని, సౌఖ్యంగాని పొందలేరు.

కనుక పేరును, మంచి సంఖ్య వచ్చునట్లుగా మార్చు కోవాలి. 8, 17, 26, 35, 44 తేదీలు వీరికి ప్రతికూలంగా ఉంటాయి. అందుకే ఈ సంఖ్యలు వదిలివేయాలి. మొత్తంమ్మీద 4,8 సంఖ్యల వారి జీవితాలు కష్టనష్టాలతో కూడుకుని ఉంటాయి.

**5వ సంఖ్య**

ఈ సంఖ్య గలవారు మే 21 నుండి జూన్ 23 వరకు మిధునరాశి నందు, ఆగష్టు 21 నుండి సెప్టెంబరు 23 వరకు కన్యరాశి యందు ఉంటారు.

వీరు తర్కశాస్త్రమునందు, తర్కవాదమునందు మంచి ప్రతిభ కలిగి ఉంటారు.

గొప్పవారితో పరిచయం చేసుకుని, వారి మూలంగా విశేష అభివృద్ధిని పొందుతారు. వ్యాపారమందు అధిక ధనాన్ని ఆర్జించగలుగుతారు.





ఈ సంఖ్యగలవారికి బుధవారం, గురువారం, శుక్రవారం అనూకూలమైన రోజులు. 5, 14, 23 తేదీలతో వచ్చిన బుధ, గురు, శుక్రవారాలు ఇంకా లాభదాయకంగానూ, శుభకరంగానూ ఉంటాయి.

వీరు వైద్యశాస్త్రములలో విశేష ప్రతిభ కనబరచి మంచికీర్తిని, ధనాన్ని కలిగిన వారగుదురు.

**6వ సంఖ్య**

ఈ సంఖ్యగలవారు ఏప్రిలు 20 నుండి మే 24 వరకు వృషభరాశి నందు, సెప్టెంబరు 21 నుండి అక్టోబరు 24 వరకు తులరాశి యందు ఉంటారు.

వీరికి మంగళవారం, గురువారం, శుక్రవారం అనుకూలమైన రోజులు.

ఈ సంఖ్యగలవారు అందరితోనూ స్నేహంగా మెలుగుతుంటారు. సాంఘిక అభివృద్ధికి పాటుపడుతుంటారు. ఇతరులను సులభంగా ఆకట్టుకుంటారు.

**7వ సంఖ్య**

ఈ సంఖ్యగలవారు జూన్ 21 నుండి జులై 25 వరకు కర్కాటక రాశినందు, జులై 25 నుండి ఆగష్టు 31 వరకు సింహరాశి యందు ఉంటారు.

ఈ సంఖ్యలో జన్మించిన వారి జీవితం విశేషయోగవంతంగా ఉంటుంది. ఈ సంఖ్య స్త్రీలకు దాంపత్యజీవితం సుఖమయంగా ఉంటుంది.

వీరికి ఆదివారం, సోమవారం మంచి అనుకూలమైన రోజులు.

ఈ సంఖ్యకు అధిపతియైన కేతువు మోక్షానికి, వేదాంతానికి కారణము అవుతున్నాడు. ఈ మానవ జీవితమంతా 7వ సంఖ్యలోనే ఇమిడివుంది. పుట్టినది మొదలు, ప్రపంచ విషయాలన్నీ 7వ సంఖ్యలో సంబంధం కలిగివున్నవి.

**8వ సంఖ్య**

ఈ సంఖ్యగలవారు డిసెంబర్ 21 నుండి జనవరి 26 వరకు మకరరాశి నందు జనవరి 26 నుండి ఫిబ్రవరి 19 వరకు కుంభరాశి యందు ఉంటారు.

8వ సంఖ్య యందు శనియొక్క కాలంలో జన్మించిన వారికి శనివారం అధిక శుభకరంగానూ, లాభదాయకంగానూ ఉండును. శని ఆయుర్దాయానికి, దురదృష్టానికి కారణం అవుతున్నాడు.

8వ సంఖ్య వారికి శనివారం, ఆదివారం, సోమవారం మంచి అనుకూలమైన రోజులు. ఈ రోజులలో ఏ పని తలపెట్టినా విజయవంతంగా నెరవేరుతుంది. అధిక ధనలాభం కలుగుతుంది.